# గ్రామబంధు గ్రంథమాల

## ఆశయములు

1 గ్రామాభ్యుదయమునకు తోడ్పడు ఉత్తమోత్తమ రచనలను సేకరించి ప్రకటించుటయే మా గ్రామబంధు ప్రచురణ యొక్క ముఖ్యోద్దేశము.

2 ప్రస్తుత రాజకీయ పరిస్థితులను సామాన్యప్రజకు సహితము తేటతెల్లముగా విశదపఱచుటకును ప్రస్తుతము మన జాతీయోద్యమమునకు వేరుపురుగులై యున్న దుష్ట శక్తులను నిర్మూలించుటకును మా శాయశక్తుల కృషి చేసి ప్రజలను సన్మార్గ చ్యుతులు కాకుండా కాపాడి, లక్ష్యస్థానము చేర్చుటకును, మా గ్రామబంధు గ్రంథప్రచురణ యుపక్రమింపబడినది.

3 మన భాషలలో లేనివి, యితర భాషలలో ఉన్న ఉత్తమ గ్రంథములను మన భాషలోనికి తర్జుమా చేసి ప్రజలకందించుట,

4 జాతీయోద్యమమునకు మా శాయశక్తుల కృషి చేసి ప్రజలను ఋజుపథమునుండి తప్పిపోకుండ చూచుటయే మా నిశ్చయము.

5 జాతీయ నాయకుల అమూల్యసందేశములను ప్రజకు అందచేసి మా కర్తవ్యము నిర్వహించెదము.

కనుక దేశాభిమానులెల్లరును మాకు చేయూత నిచ్చి మమ్ము కార్యసఫలులుగా చేయ గోరుచున్నాము.

బందరు,
9—8—45.

ప్రకాశకులు:
గ్రామబంధు ప్రచురణలు.

# అంకితము

గత స్వాతంత్ర్య సంగ్రామములో అసువులను గోల్పోయిన, పెక్కు యిడుములకు గురియైన త్యాగమూర్తులకు మా అశ్రుధారలతో ఈ చిన్న గ్రంథమును అంకితమిచ్చుచున్నాము:

—ప్రకాశకులు.

# పీఠిక



ఈ గ్రంథం 1942 ఆగస్టులోనే పూర్తి అయింది. కాని ఆ ఆగస్టు 12 వ తేదీనే ప్రభుత్వంవారు నన్ను నిర్బంధించి 1944 డిశంబరు 9 వ తేదీన విడుదల చేశారు. ఈలోగా ఈ గ్రంథం వ్రాతప్రతి చదివిన మిత్రులు దీనిని ముద్రిద్దామని ప్రయత్నాలు చేశారు. కాని అప్పటి వాతావరణంలో సాధ్యపడలేదు. నేను విడుదలైన తరువాత కూడా, అంతకుపూర్వం వ్రాసిన గ్రంథభాగాన్ని చదివితే యేమీ నా అభిప్రాయాలను మార్చుకోవలసిన అవసరం కనపడలేదు. పై పెచ్చు ఇంకా అవి బలపడడానికి తగిన సంఘటనలు చాలా జరిగినవి. ఆ గ్రంథ మలాగే ఉంచి తరువాతవిషయాలు కూడా చేరుస్తూ అక్కడక్కడా పొందిక కుదరడానికి చిన్నచిన్న సవరణలు చేశాను. తగిన ఆధారం లేకుండా యే అభిప్రాయాన్నీ నే నిందులో వెల్లడించలేదు.

గ్రంథముయొక్క యోగ్యతాయోగ్యతలను గూర్చి నిర్ణయించుకోవడం పాఠకుల పని.

కొడాలి ఆంజనేయులు.



# యుద్ధము

# కమ్యూనిష్టులు - కాంగ్రెసు

"ఇప్పుడు జరిగే యుద్ధం అంతర్జాతీయప్రజాయుద్ధంగా మారిపోయింది. కాంగ్రెసు సంకుచితజాతీయదృక్పథంతో ఆ సంగతి గమనించడం లేదు. ఈ యుద్ధంలో భారతదేశ ప్రజలు తమకు స్వాతంత్ర్యం లభిస్తేనేగాని జోక్యం కలిగించుకోజాలరనీ, బ్రిటిషుప్రభుత్వానికి సహకారం చేయజాలరనీ పూర్వపు పంథాలోనే కాంగ్రెసువారు చెబుతున్నారు. కాంగ్రెసుదృష్టి మారాలి. ఏ విధమైనషరతులు లేకుండా బ్రిటిషుప్రభుత్వానికి ఈ యుద్ధంలో సహకారం చెయ్యాలి" అని మనదేశంలోని కమ్యూనిష్టులూ, వారి చెప్పుచేతలలో నుండే మరికొన్ని యితరసంఘాలకు చెందిన మరికొంతమంది గ్రామాల వెంట ప్రచారం చేస్తున్నారు. ఇందుకు ప్రత్యేకం పత్రికలు కూడా స్థాపించారు. ఈ సిద్ధాంతంలో ఎంతవరకు నిజ మున్నదో కొంచెం స్థిమితంగా ఆలోచిద్దాం.

1939 సెప్టెంబరు 1వ తేదిని యుద్ధం ప్రారంభ మయింది. అప్పటినుంచి 1941 నవంబరు నెలాఖరుకు కూడా కాంగ్రెసుతో పాటు హిందూదేశములోని అభివృద్ధికి దారితీసే అన్నిపక్షాల వారు ఈ యుద్ధం సామ్రాజ్యవాదులకూ, ఫాసిస్టులకూ మధ్య తమ తమ అధికారప్రాబల్యము కోసం నడుపబడుతున్నది కాబట్టి భారతప్రజ లీయుద్ధంలో జోక్యం కల్పించుకోరా దని

యేకగ్రీవంగా ఆమోదించారు. అయితే కొంతకాలము నుండీ యిది ప్రజాయుద్ధంగా మారిపోయిం దనీ, మనం యేషరతులూ లేకుండా బ్రిటిషుప్రభుత్వానికి సహకారం చేయా లనీ మన దేశంలోని కమ్యూనిష్టులు ప్రచారం సాగించారు. ఎవరైనా ఎప్పటినుండి ఈ యుద్ధము ప్రజాయుద్ధ మయిం దని ప్రశ్నిస్తే 'రష్యా ఈ యుద్ధంలో పాల్గొన్నప్పటినుండీ' అని జవాబు చెబుతారు. అనగా జర్మనీకి, రష్యాకూ యుద్ధం పొసగిన తరువాత ఇది ప్రజాయుద్ధ మయిందంటారు.

జర్మనీతో రష్యాకు 1941 జూన్ 22 వ తేదీన యుద్ధం పొసగింది. కాని మన కమ్యూనిష్టులు అప్పటినుండీ యుద్ధాన్ని ప్రజాయుద్ధ మని ప్రచారం చేయలేదు. పైపెచ్చు యుద్ధవ్యతిరేక ప్రచారంకూడా చేశారు. జపాను - ముఖ్యంగా బ్రిటను, అమెరికాలపై యుద్ధం సాగించి దక్షిణాన పసిఫిక్కు మహాసముద్రంలో దిగిన తరువాతనే, జర్మనీ, ఇటలీ, జపానులవంటి నాజీ, ఫాసిస్టు, మిలిటరీదేశాలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తూన్న రష్యా, చైనా, ఇంగ్లాండు, అమెరికాలు, ప్రపంచప్రజానీకం పక్షాన యుద్ధం చేస్తున్న వనిన్నీ, కాబట్టి యిది ప్రజాయుద్ధ మనిన్నీ, అందువల్ల భారతీయులమైన మనము యే షరతులూ లేకుండా బ్రిటిషు ప్రభుత్వంతో సహకారం చేయా లనీ మన కమ్యూనిష్టులూ, వారి సహకారులూ ఏ మేమో ఉపన్యాసాలు చేస్తున్నారు. రష్యా యుద్ధంలోకి దిగగానే ఈ యుద్ధం ప్రజాయుద్ధ మయిందనే ఈ యిండియన్ కమ్యూనిస్టులు తరువాత ఆరునెలలవరకూ కూడ, అనగా జపానుకూడా, అమెరికా బ్రిటనులతో యుద్ధంలోకి దిగేదాకా

ఇది ప్రజాయుద్ధమని ఎందుకు ప్రచారంచేయలేదో దానికి ప్రబల కారణముంది. ఆ కారణం ముందు వివరిస్తాం. కాని, యిప్పుడు రష్యా, ఇంగ్లండు, అమెరికా, చైనా దేశాలలో యే ఒక్కదేశ మైనా సరే, ప్రపంచప్రజానీకం కోసం ఈ యుద్ధం చేస్తున్నదా అనే విషయం మొట్టమొదటగా విచారించాలి.

రష్యా:—రష్యా జర్మనీతో పోరాడుతూన్నది గనుక ఇది ప్రజాయుద్ధ మయింది– ఫాసిస్టు వ్యతిరేకపోరాట మయింది అని మన కమ్యూనిస్టు లంటారు. అది నిజంకాదు; రష్యా నాయకుడు స్టాలిన్ చేసిన ప్రతిపనీ ప్రపంచప్రజలశ్రేయస్సు కొరకే నని నమ్మడానికి వీలులేదు. హిట్లరుకూ, స్టాలినుకూ రాజకీయ, సాంఘిక సిద్ధాంతాలలో బొత్తిగా కలయిక లేదు. అయినప్పటికీ స్టాలిన్ హిట్లరుతో 19-8-39 న వాణిజ్యసంధి చేసుకొన్నాడు. 23-8-1939 న నిరాక్రమణ సంధి (Non-Agression Pact) చేసుకున్నాడు. 1-9-39 న హిట్లరు యుద్ధము ప్రారంభించాడు. హిట్లరుతో స్టాలిన్ సంధిచేసు కొన్న పదిరోజులలోనే ప్రపంచయుద్ధం ప్రారంభ మయింది. ఈ సంధి జరుగగానే అంతర్జాతీయ రాజకీయ వేత్తలు యుద్ధం తప్పదన్నారు. అలాగే జరిగింది.

హిట్లరీ సంధి యెందుకు చేసుకొన్నాడు? ఇంతవరకూ ఫాసిస్టు ప్రభుత్వాలు చేస్తున్న దురాక్రమణలకు ఇంగ్లండు ఫ్రెంచిప్రభుత్వాలు లొంగిపోతూ వచ్చినయి. కాని పోలండు సందర్భం వచ్చేసరికి అవి గట్టిగా నిలబడ్డాయి. పోలండు సంరక్షణకు బ్రిటనులోని ఛాంబర్లేను ప్రభుత్వం 31.3-39 న గ్యారంటీ యిచ్చింది. కాబట్టి తాను పోలండు

లోకి పోయేసరికి యింగ్లాండు ఫ్రాన్సు సైన్యాలు పడమరనుండి రాగా తనకు ప్రబలశత్రువైన రష్యనుసైన్యాలు కూడా తూర్పునుండి వస్తే అడకత్తెరలో పోకచెక్కలాగున నలిగిపోతామని హిట్లరు భయపడ్డాడు. 1914 లో అంతే జరిగింది. అందువల్లనే కెయిజరు ఓడిపోయినాడు. ఈసందర్భములో "లూయీ ఫిషరు" 1930 లో వ్రాసిన "The Soviets in World Affairs" అనే గ్రంథంలోని ఈ క్రింది అంశమును ఇక్కడ ఉదహరించడ ముచిత మని తలుస్తున్నాను. అది ఏమంటే "జర్మనీ యొక్క పశ్చిమాకాశము చీకటిగా నున్నపుడు ఆ దేశము తూర్పువైపుకు వెలుతురుకోసం చూస్తుంది. ఈ సూత్రం అన్ని కాలాలలోనూ సరిగా వర్తిస్తుంది. మొదటి యూరపు యుద్ధము నాటినుండీ జర్మనీ, సోవియట్‌రష్యాను గూర్చిన తనవైఖరిని; పశ్చిమరాజ్యాలు తనయం దవలంబించే ధృక్పథమును బట్టి నిర్ణయించుకుంటూన్నది." ఇదీ జర్మనీమానసిక ప్రవృత్తి. అందువల్లనే తూర్పున స్టాలినుతో సంధిచేసుకొనిగాని, హిట్లరు తానీ పర్యాయము పోలండుపై పడదలచుకోలేదు. ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాల రాయబారులు స్టాలినుతో మిత్రత్వం చేసుకొని యుద్ధం వచ్చేటట్లయితే హిట్లరును చచ్చేటట్లు దెబ్బకొట్టాలని 1939 ఏప్రిల్‌నుండీ ప్రయత్నిస్తూండగానే హిట్లరు రెండోకంటివాడికి తెలియకుండా స్టాలినుతో నిరాక్రమణసంధి చేసుకోగలిగాడు. సోవియటురష్యా ఎంతోకాలంనుండి పదేపదే ప్రకటిస్తూన్నా ప్రజాసంయుక్త సంఘటనము (Popular front) సమష్టి సంరక్షణ (Collective Security) అనే సిద్ధాంతాలకు సమయం వచ్చేసరికి స్వస్తి చెప్పింది.

## స్టాలిను ఎందుకు ఒప్పుకున్నాడు?

దీనికి కారణం అనేకులు అనేకవిధాలుగా చెప్తారు. జర్మనీ 22-6-41న రష్యాపై దండెత్తిన తరువాత స్టాలిను రష్యా ప్రజలకు యిచ్చిన ఉపన్యాసంలో "హిట్లరు, రిబ్బన్‌ట్రాపుల వంటి రాక్షసుల నాయకత్వం క్రింద ఉన్న జర్మనీతో రష్యా ఎలా నిరాక్రమణసంధి చేసుకున్నది? ఆ సందర్భంలో రష్యా తప్పుచేయలేదా?" అని ఎవరైనా అడుగవచ్చు. నేను తప్పు చేయ లేదంటాను. నిరాక్రమణసంధి అంటే రెండు ఇరుగు పొరుగు దేశాలమధ్య పోరాటంలేకుండా ఉండా లనే సంధి. జర్మనీ మనతో 1939లో అటువంటి సంధి చేసుకుంటా నంటే వద్దనడము న్యాయమా? ఆసంధివల్లనే మనకు 18 మాసాలు శాంతి చేకూరింది. అంతేకాదు. "జర్మనీ మనమీద పడ్డప్పుడు మనలను రక్షించుకోవడానికి తగిన సైనికసన్నాహాలు చేసుకునేందుకు తగిన సావకాశంకూడా లభించింది" అని ప్రసంగించాడు. ఈప్రసంగంవలన స్టాలిను తనదేశరక్షణార్థం మాత్రమే ఈ నిరాక్రమణసంధి చేసుకొన్నట్లు తేలుతుంది. కాని తక్కిన యూరోపియను దేశాలగతి ఏమయింది? డెన్మార్కు, హాలండు, బెల్జియం, ఫ్రాన్సు, పోలండు, యుగోస్లేవియా, గ్రీసు మొదలగు దేశాలు హిట్లరు పదాఘాతాలకు గురికాలేదా? ఈ నాడక్కడి కష్టజీవులు ఫ్యాక్టరీలలో జర్మనీప్రభుత్వం క్రింద అణగి మణగి మామూలుగా చేసే కాలంకంటె ప్రతిరోజూ యెక్కువసేపు పని చేసి హిట్లరుయొక్క సమరసన్నాహాలకు బలం చేకూర్చడం లేదా? ఈ సంగతి ఆయా దేశప్రజలకు ఎంతదుఃఖకరంగా ఉంటుందో స్వానుభవంగల భారతీయులకు నచ్చజెప్పవలసిన

పనిలేదు. ఇది స్టాలినురాజనీతివలన కలిగిన దుష్ఫలితం. స్టాలిను హిట్లరుతో చేసుకున్న సంధి ప్రపంచప్రజానీకము యొక్క శ్రేయస్సుకోసం కాకపోవడమేకాకుండా పై పెచ్చు ఈ పై పేర్కొన్న దేశప్రజలను అధఃపతితులనుగ చేయ డానికి ఉపయోగపడ్డది. స్టాలిను హిట్లరుతో సంధిచేసుకున్న పుడు కూడా హిట్లరు ఫాసిస్టే.

## హిట్లరుతో సంధి కేవలము సోవియట్ రక్షణకోసమేనా?

స్టాలిను చెప్పినట్లు హిట్లరుతో ఆయన చేసుకున్న నిరా క్రమణసంధి కేవలం సోవియటు రక్షణ కోస మేనా? కొంచెం పర్యాలోచిస్తే కాదని తెలుస్తుంది. హిట్లరు తనమీద వచ్చి పడ కుండా ఉంటా డనే నమ్మకంతోనే స్టాలిను సంధిచేసుకున్న ట్లయితే తానుపోట్లుచప్పుడు కాకుండా తన సైనికసన్నాహా లను బలపరచుకొనేవాడు. అదికాదు, పోలందును పంచుకో డానికి హిట్లరుతో స్టాలిను సంధిచేసుకున్నాడు. 17-9-39 న పోలండులో స్టాలిన్ చొరబడే వరకూ ఈ సంగతి ప్రపంచ కానికి తెలీదు. ఆ క్రిందటి రోజువరకూ మంగోలియా సరి హద్దు విషయంలో రష్యాకూ, జపానుకూ పోరాటం జరుగు తూనే యున్నది. 16-9-39 న జపానుతో స్టాలిన్ రాజీ చేసుకొని తనకు వెనుక తూర్పురంగాన తగాదా లేకుండా చేసుకొన్నాడు.

## పో లం డు క థ

ఈ నాటివరకూ కూడా పోలండులోని ప్రజలు రష్యాను ఆహ్వానిస్తే గష్యను సైనికులు వెళ్లినట్లు మనమిత్రులైన కమ్యూ

నిష్టులు ప్రచారము చేస్తున్నారు. ఆమాటకు రష్యాప్రభుత్వం కూడా ఎన్నడూ అనలేదు. పోలండు ప్రభుత్వము పోయింది కనుక అంతకు పూర్వము సోవియట్ రష్యా పోలండు ప్రభుత్వంతో చేసుకున్న నిరాక్రమణ ఒడంబడిక దానంతట అదే రద్దయి పోతుంది. అందుచే పోలండులో రష్యన్ సైన్యాలను ప్రవేశపెట్టామన్నారు. అంతే కాని పోలండు ప్రజలు తమను ఆహ్వానిస్తే వెళ్లినట్లు వారనలేదు. అంతే కాదు, పోలండును తాము సగము ఆక్రమించుకోవడానికి రష్యను ప్రభుత్వం హిట్లరు అనుమతి పొందింది. కాని పోలాండు ప్రజల అనుమతి పొందలేదు. పోలండు దోపిడీలో జర్మనీతో రష్యాకూడా కలుస్తుందని ఆగస్టు 16-1939 ని అనగా యుద్ధం ప్రారంభమవడానికి 15 రోజులు ముందుగానే – బెర్లినులోని బ్రిటిషు రాయబారి సర్ నెవిల్లీ హెండర్సను, హాలిఫాక్సు ప్రభువుకు తెలియచేశాడు. సర్ నెవిల్లీ హెండర్సన్ తనకూ, జర్మన్ విదేశాంగ సహాయమంత్రికీ జరిగిన సంభాషణఫలితాన్ని ఈ క్రింది విధంగా హాలిఫాక్సుకు తెలియపరచాడు.

"I was impressed by one thing namely Baron Von Weissack's detachment and calm. He seemed very confident and professed to believe that Russian assistance to the Poles would not only be entirely negligible, but that the U. S. S. R. would even in the end join in sharing the Polish spoils. Nor did my insistence on the inevitability of British intervention seemed to move him."

"ముఖ్యంగా బారన్ వాన్ వీసాక్సు (జర్మను విదేశ రాజ్యాంగ సహాయమంత్రి)యొక్క నిర్మమత్వమూ, నిర్వి

కారమూ నాకు బాగా నచ్చినవి. పోలండుకు రష్యా చేసే సహాయం గమనించడానికి వీల్లేనంత అత్యల్పంగా ఉంటుం దనీ, చిట్టచివరకు పోలండు దోపిడీలో ఆ దేశం తమతో కలుస్తుం దనీ కూడా ఆయన గట్టిగా విశ్వసిస్తున్నట్లు కనిపించాడు. బ్రిటిషువారు జోక్యం కల్పించుకుంటారని నే నెంత నచ్చచెప్పినా ఆయనకు చీమకుట్టినట్లు కూడా లేదు." దీనిని బట్టి పోలండు మొదల రష్యావైఖరిని, జర్మనీ నిరాక్రమణసంధికి పూర్వమే ఆయన సరిగా అర్థం చేసుకున్నట్లు తెలియగలదు.

పోలాండు ఆక్రమణను గూర్చి, 18-9-39 న మాస్కో-నుండి ప్రకటించబడిన రష్యన్, జర్మన్ ప్రభుత్వాల సమిష్టి ప్రకటనను ఈక్రింద ఉదాహరిస్తున్నాము, చూడండి.

*Moscow* :—18-9-39.

A German Soviet Communiqne published here, states :—

"In order to forestall unfounded rumours of every description regarding the tasks of the Soviet German troops acting in Poland, the U. S. S. R. and the German Governments declare that the actions which these troops pursue have no aim contrary to the interests of either country and contradicting the spirit and letter of non-agression pact concluded between them.

"On the contrary the task of these troops is to re-establish in Poland peace and order disrupted by the collapse of the Polish state and assist the Polish population in reconstructing conditions of their state of existence."

మాస్కో. సెప్టెంబరు 18:— "పోలాండులో వున్న జర్మను సోవియట్ సైన్యాల విధులను గూర్చి ఆధారం లేని చిత్రవిచిత్రాలైన అపోహలు కలుగకుండా ఉండడానికి, రష్యా జర్మను ప్రభుత్వాలు తమ తమ దేశాలక్షేమానికి భంగకరంగా గానీ, తమలో తాము చేసుకున్న నిరాక్రమణసంధికి విరుద్ధంగా గానీ, తమ సైన్యాలు ప్రవర్తించబోవడము లేదని ముందుగానే ప్రకటిస్తున్నారు.

అంతే కాక పై పెచ్చు పోలిష్ప్రభుత్వం పడిపోయి నందువలన తిరిగి పోలండులో శాంతి భద్రతలను చేకూర్చడానికిన్నీ, ప్రజాజీవితానికి కావలసిన స్థితిగతులను పునరుద్ధరించడానికిన్నీ ఈసైన్యాలు పనిచేస్తాయి."

ఉభయప్రభుత్వాలూ చేసిన ఈ ప్రకటనవల్లనున్నూ, సోవియట్ జర్మన్ సైన్యాలు (Brest Letovisk) బ్రెస్టులిటోవిస్కులో కలుసుకున్నపుడు ఒకరి కొకరు ధన్యవాదా లర్పించుకున్నా రని జర్మన్ అధికారవార్తాప్రతినిధివర్గానికి (German Official News Agency) మాస్కోనుండి పంపబడిన వార్తవల్లనూ, పోలాండులోకి వెళ్లి రష్యాసైన్యాలు ఆక్రమించడం, పోలాండు ప్రజల ఆహ్వానం పైన కాక, సోవియట్ జర్మను గవర్నమెంట్లు ముందుగా చేసుకున్న ఏర్పాట్లవల్లనే నని ధ్రువపడగలదు.

ఇంకా ఏమైనా సందేహముంటే రిబ్బన్ట్రాపు 1939 అక్టోబరు 24 వ తేదీన విజయోత్సాహంలో డాన్జిగ్ నుండి

చేసిన ప్రసంగంలోని ముఖ్యభాగ ముదాహరిస్తాము — చూడండి:—

"The English propaganda declared that the Russian army would certainly not participate in the measures against Poland. Instead the Russian troops after a very few days moved forward on the entire front in Poland and occupied Polish territory up to the lines of demarcation which we had previously agreed upon with the Russians."

"పోలాండుకు వ్యతిరేకమైన చర్యలలో రష్యాసైన్యం జోక్యం కల్పించుకోదనే మాట నిశ్చయ మని ఇంగ్లీషువారు ప్రచారంచేశారు. అందుకు విరుద్ధంగా కొద్దిరోజులలోనే రష్యా సైన్యాలు పోలాండు సరిహద్దంతా నడచి మే ముభయులమూ ముందుగా నిర్ణయించుకొన్న ప్రకారము పోలండు భూభాగంలో ఎంతవరకు ఆక్రమించుకోవాలో అంతవరకూ ఆక్రమించుకొన్నారు."

ఈ రిబ్బన్‌ట్రాపు ధోరణివల్ల పోలండు ఆక్రమణను గూర్చి రష్యా జర్మను ప్రభుత్వాలు ముందుగానే ఒడంబడిక కుదుర్చుకొన్నట్లు కూడా స్పష్టపడుతూన్నది.

అయితే పోలండు పంపిణీకి సంబంధించిన ఒడంబడిక పత్రం మాత్రం 1939 సెప్టెంబరు 28 వ తేదీన ఉభయప్రభుత్వ ప్రతినిధులూ సంతకము చేసుకున్నారు. వార్సా లోబడి పోయింది ఆనాడే. వార్సా లోబడగానే ఈ ఒడంబడికసంతకం చేసుకున్నా రన్నమాట. రష్యన్ సైన్యాలు సెప్టెంబరు 17 వ పోలండులో ప్రవేశించినవి. ఆ నాటికే పోలండు ప్రభుత్వము

పోయిం దని రష్యావిదేశాంగమంత్రి మాల్టావ్ వాదన. కాని పోలండు 28 వ తేదీవరకూ ఆక్రమణదారులతో పోరాడు తూనే ఉన్నది. పోలండు ప్రభుత్వం పూర్తిగా పోయినవెంటనే పోలాండు పంపకమును గూర్చి రష్యా జర్మన్ ప్రభుత్వాలు సంధిపత్రము వ్రాసుకొన్నవి. రిబ్బన్‌ట్రాపు అక్టోబరు 24 వ తేదీని చెప్పిన పైమాటలను అక్టోబరు 31 వ తేదీని రష్యా విదేశాంగమంత్రి యెలా బలపరచాడో చూడండి.

"There was one swift blow to Poland first by the German army and then the Red army and nothing was left of this ugly offspring of Versailles treaty."

"పోలాండు కొక్క విసురైన దెబ్బ మొట్టమొదట జర్మనుసైన్యాలవల్లనూ తరువాత రష్యనుసైన్యంవల్లనూ తగిలింది. అందువల్ల వర్సెయిల్సుసంధి ఫలితముగా కలిగిన ఈ దుష్టపరిణామం (పోలాండు ఉనికి) పూర్తిగా రూపుమాసి పోయింది."

రష్యా విదేశాంగమంత్రి మాలటోవ్ చెప్పిన ఈ పై వాక్యాలవల్లనే పోలండు పతనం తర్వాత రష్యనుసైన్యాలు ప్రవేశించలేదనీ, రష్యనుసైన్యం కూడా జర్మన్‌సైన్యంతో పాటు పోలాండుపతనానికి కారణభూతమైన దనీకూడా స్పష్ట పడుతూన్నది కదా!

కాబట్టి ఒకజర్మనీయే కాదు పోలాండులో 26-1-34 న చేసికొన్న నిరాక్రమణ సంధిని తృణీకరించినది - రష్యాకూడా

పోలాండుతో 1932 లో చేసికొన్న నిరాక్రమణసంధిని త్రోసిపుచ్చిన దని తెలియగలదు.

రష్యాకూ, పోలాండుకూ, నిరాక్రమణసంధి మొట్ట మొదట 1932 జూలై 20 తేదీని జరిగింది. 1934 మే 5 న జరిగిన మఱియొక ఒడంబడిక ద్వారా ఆసంధి 1945 డిసెంబరు ఆఖరువరకూ కూడా అమలులో నుండవలసి ఉంది. దానినే ఇప్పుడు రష్యా భగ్నంచేసింది. పోలాండు నాక్రమించడానికి సైన్యాలు పంపుతూ, 16-9-39 రాత్రి రష్యా విదేశాంగ మంత్రి మాల్టావ్, మాస్కోలోని పోలిష్‌రాయబారికి పంపిన శ్రీముఖంలోని విషయాలను బట్టి చూస్తే, పోలిష్ప్రభుత్వం పోయింది గనుక రష్యన్ ప్రయోజనాలను కాపాడుకోవడానికీ, వైటురష్యనులనూ, ఉక్రేనియన్ అల్పసంఖ్యాకులను రక్షించ డానికీ, సోవియట్ సైన్యాలు పోలండులోకి పోతూన్నవని తెలిపినట్లు స్పష్టపడుతుంది. అంతే కాక మాల్టావ్ పంపిన శ్రీముఖంలోని ఈ క్రిందిభాగాలుకూడా పాఠకులు గమ నించాలి.

"The whereabouts of the Polish Government are unknown. The Polish German War has revealed the rottenness of the Polish state and the Government. During the ten days of war Poland has lost all her industrial and cultural centres. Warsaw, as capital, no longer exists. Polish Government was broken up. It no longer shows any signs of life and this means that Polish State and its Govt. no longer exist. In consequence the agreement signed between the Soviet Union and Poland have become invalid."

"పోలిష్ ప్రభుత్వం ఎక్కడున్నదో తెలియడంలేదు...
......పోలిష్ జర్మను యుద్ధం, పోలిష్ రాజ్యంలోనూ, ప్రభుత్వంలోనూ ఉన్న కుళ్లంతా బయట పెట్టింది. యుద్ధం జరుగుతూన్న 10 రోజులలోనే పోలాండులోని పారిశ్రామికవిజ్ఞాన కేంద్రాలన్నీ నాశన మైనవి. వార్సా పోలండు కిప్పుడు రాజధానిగా లేదు. పోలిష్ ప్రభుత్వం విచ్ఛిన్న మైపోయింది. అది సజీవంగా ఉన్నట్టు ఇప్పు డేమీ చిహ్నాలుకూడా లేవు. అనగా ఇప్పుడు పోలిష్ రాజ్యం కానీ, పోలిష్ ప్రభుత్వం కానీ లేదన్న మాట. కాబట్టి సోవియట్ యూనియను పోలండుల మధ్య జరిగిన ఒడంబడికి అమలులో లేదు."

ఈ శ్రీముఖంలోని భాష ఎంత నిర్దాక్షిణ్యముగా నున్నదో చూడండి. వార్సా పోలాండుకు ముఖ్యపట్టణంగా లేనంతమాత్రమున పోలండు ప్రభుత్వము పోయినట్లా? మాస్కోనుండి కుబ్జిషేవ్ కు సోవియటు ప్రభుత్వం మార్చినంత మాత్రాన సోవియటు ప్రభుత్వం పోయిం దంటామా? సరిగా ఈ శ్రీముఖం మాస్కోలోని పోలిష్ రాయబారికి అందచేసే నాటికి పోలిష్ ప్రభుత్వం పోలిష్ రుమేనియా సరిహద్దులలోని, పోలండులో నున్న "కుంటీ"లో ఉన్నట్లు పోలండునుండి వచ్చిన వార్తలు మన యిండియాపత్రికలలో కూడా ప్రచురింపబడినవి. సరిహద్దులలోని పోలాండు-సోవియటు రష్యాకు ఈవార్త చేరలే దనడం హాస్యాస్పదం. అదీ గాక సోవియటు సైన్యాలు పోలాండులో ప్రవేశించిన 10 రోజులవరకూ కూడా పోలిష్ ప్రభుత్వం పోలే దనీ, జర్మను సోవియటుసైన్యాలు రెండూ కూడా సమానంగా పోలండు పతనానికి కారణమైన వనీ, రష్యా

జర్మన్ ప్రభుత్వాధికారుల ప్రకటనల నుదాహరించి ఋజువు చేశాము.

ఇక సోవియటు రష్యా ప్రయోజనాలు కాపాడుకోవడానికి రష్యనుసైన్యాలు వెళ్లిన వనడంలో సోవియట్ ప్రయోజనా లంటే ఏమిటో ఆలోచించాలి.

## సోవియట్ ప్రయోజనాలు - మైనారటీల రక్షణ

ఈ సందర్భములో హిట్లరు పోలండును పూర్తిగా ఆక్రమించిన ట్లయితే సోవియటురష్యా సరిహద్దులలోకి వచ్చి రష్యాకు ఆయన ప్రమాదకరంగా ఉండేవా డని సోవియట్ మిత్రు లంతా చెబుతారు. ఇప్పుడు సోవియటురష్యా ఆక్రమించిన పోలండుకు మాత్రం హిట్లరు సరిహద్దులలో లేడా? అయితే సోవియటురష్యా అసలు సరిహద్దులలోకి వచ్చేలోగా పోలండు తూర్పుభాగంలో హిట్లరుసైన్యాలను రష్యన్ సైన్యా లెదుర్కొని యుద్ధము చేయవచ్చును గదా! అని సమాధానం చెబుతారు. ఈ సమాధానంవల్ల సోవియటురష్యా రక్షణకోసం, తూర్పు పోలాండును జర్మను రష్యనుసైనికులకు యుద్ధరంగంగాచేసి, తాము రక్షించబూనుకొన్నా మని చెప్పే వైట్ రష్యన్లనూ, ఉక్రేనియన్ అల్పసంఖ్యాకులనూ, యుద్ధమువల్ల వచ్చే అన్ని దుష్ఫలితాలకూ ఆహుతి చేయడంకాదా? కాబట్టి సోవియటు రక్షణ, వైటురష్యన్ యుక్రేనియన్ లరక్షణా, పరస్పరవిరుద్ధ కార్యా లని తేలుతూన్నది.

నిజంగా వైటురష్యనులు, యుక్రేనియన్ మైనారిటీలు పోలిష్ప్రభుత్వంక్రిందనే చాల హింసింపబడుతున్నట్లు

డి. యన్. ప్రిట్ వ్రాసిన "లైట్ ఆన్ మాస్కో" (Light on Moscow') అనే గ్రంథంలో అనేక తార్కాణాలు చూపించాడు. వైటురష్యనులు, ఉక్రేనియను మైనారిటీలు పోలండులో 1921 నుండి ఉన్నారు. 18 ఏండ్లనుండి వారు పోలాండు ప్రభుత్వంచేత బాధింపబడుతూనే ఉన్నారట. అటువంటి ప్రభుత్వంతోనే సోవియటు రష్యా నిరాక్రమణ సంధి 1932లో చేసుకున్నది. తరువాత 1933 జూలై 3వ తేదీన ఆక్రమణ అనగా ఏమిటో సోవియట్ రష్యా, పోలాండు, ఎస్తోనియా, లాట్వియా, ఆఫ్గనిస్థాన్, పర్షియా, రుమేనియా, టర్కీ దేశాల ప్రతినిధులు తమలోతాము నిర్వచన చేసుకున్నారు. అందులో ఈ ఒడంబడిక చేసుకున్న దేశాలలో యేదేశంకానీ, మఱొకదేశాన్ని ఆక్రమించుకోవడానికి ఈ క్రింది నెపాలుకూడా కారణాలుగా ఉండకూడదని నిర్ణయించుకున్నారు.

"The internal position of any state, as for example; its political, economic, social structure; alleged short-comings of its administration; disorder following upon strikes, revolutionary or counter revolutionary movements of civil wars."

"ఏదేశముయొక్క ఆంతరంగిక పరిస్థితులున్నూ:- అనగా, దాని రాజకీయ, ఆర్థిక, సాంఘిక నిర్మాణముగానీ, పరిపాలనాలోపాలుగానీ, ఆంతరంగికయుద్ధంవల్లనూ, విప్లవోద్యమములవల్లనూ, విప్లవవ్యతిరేకోద్యమములవల్లనూ, సమ్మెలవల్లనూ కలిగే కల్లోలములుగానీ ఆక్రమణకు కారణములుగా, ఉండకూడదు." అనగా సోవియటు రష్యా, పోలాండు ప్రభుత్వం

ఆంతరంగిక పరిపాలనా వ్యవహారమైన మైనారిటీలరక్షణ సందర్భంలో జోక్యం కలుగచేసుకో కూడదన్నమాట.

సోవియటు రష్యా తాను పోలాండు నాక్రమించుకోవడానికి కారణం, మాల్టావ్ చెప్పినట్లుగా వైటురష్యన్ ఉక్రేనియన్‌ల రక్షణయే మనయెడల వారిరక్షణకు విరోధంగావున్న పోలాండు ప్రభుత్వంతోనే, పైన ఉదహరింపబడిన నిర్వచనానికి లోబడి నిరాక్రమణసంధి చేసుకొనిఉండకూడదు. కాబట్టి ఇప్పుడు పోలాండును ఆక్రమించడానికి చెప్పిన మైనారిటీలరక్షణ అనే కారణం కేవలం ఒక నెపంమాత్రమే అవుతుంది.

ఈ వాదనలకు వ్యతిరేకంగా బ్రిటిషురాజకీయవేత్తలు కొందరున్నూ, బ్రిటిషుపత్రికలు కొన్నిన్నీ హిట్లరుఆక్రమణను కొంతవరకైనా నిరోధించడానికే పోలాండు తూర్పుభాగాన్ని సోవియటు రష్యా ఆక్రమించినదని వ్రాసిన అభిప్రాయాలను మనకమ్యూనిష్టు లుదాహరిస్తుంటారు. బ్రిటిషు పత్రికలున్నూ బ్రిటిషురాజకీయవేత్తలున్నూ రష్యాతో విరోధం తెచ్చుకోవడాని కిష్టములేకను, వీలైతే జర్మనీకీ రష్యాకూ పోరాటం కలిగించడం, తమకుశ్రేయస్సనే రాజకీయోద్దేశాలతోనూ, అలా వ్రాశారేకాని నిజంగా నమ్మికాదు. సోవియటు రష్యాతో విరోధం పెట్టుకోదలచుకుంటే, పోలాండు స్వాతంత్ర్యాన్ని గ్యారంటీ చేసిన బ్రిటను, రష్యాపై కూడా యుద్ధం ప్రకటించి తీరాల్సింది. అది రాజకీయచతురతకాదని బ్రిటనుకు తోచినది. అందువల్లనే బ్రిటిషుసామ్రాజ్యంలోని పత్రికలకు, రష్యాకు విరోధకరంగా ఉండేవ్రాతలు వ్రాయవద్దని బ్రిటిషుప్రభుత్వం సలహాయిచ్చింది

కూడాను. తరువాత సంఘటనలుకూడా బ్రిటిషురాజ్యతంత్రము యొక్క గొప్పతనాన్ని ఋజువు చేసినయి.

రష్యా యొక్క పోలాండు ఆక్రమణ హిట్లరును నిరోధించడానికి కాదనీ, ఉభయుల యిష్టంమీాదనూ జరిగిందనీ, జర్మను సోవియట్ ప్రభుత్వాలు సమిష్టిగా చేసిన ఈ క్రిందిప్రకటన చదివితే మామూాలు మనిషే గ్రహించగలడు. ఇకబ్రిటిషు రాజకీయ ధురంధరులు గ్రహించలేకపోయినారనడానికి కెలావీలు?

జర్మను సోవియటు ప్రభుత్వాలు 1939 సెప్టెంబరు 28వ తేదీన చేసిన ప్రకటన యిది:-

"The German Govt. and the Government of the U. S. S. R., by the treaty signed to-day having finally settled questions that arose as a result of the dissolution of the Polish state and having thereby created a firm foundation for a lasting peace in Eastern Europe, in mutual agreement express the opinion that the liquidation of present war between Germany on the one hand and Great Britain on the other is in the interest of all nations.

Therefore both Governments will direct their common effort, if necessary in accord with the other friendly powers, in order to attain this aim as early as possible.

If however, these efforts of both Governments remain futile, it will be established thereby that Great Britain and France bear the responsibility for the continuation of war, the Governments of Germany and U. S. S. R. will consult each other on the necessary measures."

"జర్మనుసోవియటు ప్రభుత్వాలు తమలో తాము చేసు కున్న నేటిసంధివల్ల పోలిష్ రాజ్యపతనకారణంగా ఏర్పడిన సమస్యలను గూర్చి తుదిపరిష్కారం జరుపుకోవడమే కాకుండా, ఉభయుల అంగీకారముతోనూ తూర్పు ఐరోపా ఖండములో నిరంతరశాంతికి గట్టిపునాది కూడా వేసిన వారైనారు. ఇప్పుడు బ్రిటనుకూ జర్మనీకీ జరిగే ఈయుద్ధం అంతం కావడం, అన్నిజాతులకూ క్షేమ మని కూడా వారభిప్రాయ పడుతూన్నారు.

కాబట్టి ఈ ఉద్దేశం సాధ్యమైనంత తొందరలో నెరవేరడానికి, అవసరమైతే యితర మిత్రప్రభుత్వాల సహాయంతో కూడా ఈరెండు ప్రభుత్వాలూ కలసి ప్రయత్నిస్తవి.

కాని రెండు ప్రభుత్వాల ప్రయత్నాలూ కూడా భగ్నమై యుద్ధమే కొనసాగేటట్లయితే, ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలదే ఆబాధ్యత అనేమాట స్పష్టము. అవసరమైన చర్యలను గూర్చి జర్మను సోవియటు ప్రభుత్వాలు పరస్పరం కలిసి సంప్రదించుకొంటూంటవి." ఆ రోజులలో సోవియట్ రష్యా ప్రభుత్వం ఫాసిస్టు జర్మనీతో యే విధంగా ఈడూ జోడుగా "పదంపాడుతూ కదంతొక్కుతూ తోసుకుపోయిందో" 1939 అక్టోబరు 31 వ తేదీన సుప్రీమ్ సోవియటు కౌన్సిల్ ముందు మూల్టొవ్ చేసిన ఈదిగువ ప్రసంగంనుండి తెలియగలదు.

M. Moltov declared that everybody realised that there would be no question of restoration of old Poland. It was therefore absurd to continue the present war under the flag of restoration of the former Polish state. "Britain and France do not

want the war stopped and peace restored, but are seeking new excuses for continuing the war with Germany. The British and with them the French supporters of war have declared something in the nature of ideological war on Germany, reminiscent of the religious wars of the olden times. It is not only senseless but criminal to wage such a war. As the war for destruction of Hitlerism is camouflaged as a fight for democracy the motives of Britain and France do not be in any ideology but in the profoundly material interests as mighty colonial powers.

It is fear of Germany's claims to these colonial possessions that is at the bottom of the present war —a fear that has become substantially stronger lately as a result of the collapse of the Versailles treaty. It is fear of losing world supremacy that dictates to ruling circles in Great Britain and France a policy of fomenting war with Germany. Thus the imperialist character of this war is obvious to anyone who wants to face realities and does not close his eyes to facts. One can see from all this who is interested in this war for world supremacy. Certainly not the working class —This war promises nothing to the working class—but bloody sacrifice and hardships."

" The Soviet—German non-agression pact has bound us to maintain neutrality in case Germany is participating in war. We consistently pursued this course which is in no wise contradicted by the entry of our troops into the territory of former Poland."

Speaking on the improvement of Soviet German relations M. Moltov said the development has proceeded along the lines of strengthening our friendly relations and extending our practical cooperation and rendering Germany political support in her efforts for peace."

M. Moltov declared "We always held that strong Germany is an indispensable condition for desirable peace in Europe. It is ridiculoes to think that Germany could be simply put out of commission and struck off the books. The powers which cherish this foolish and dangerous dream ignore the deplorable experience of Versailles. They do not realise Germany's increased might and fail to see. Any attempt of the retention of Versailles in the present state of international affairs which radically differs from that of 1914, may end in disaster for them."

మాల్టావ్ ఈవిధంగా చెప్పాడు. "పాతపోలాండును పునరుద్ధరించడం జరగని విషయం అనేది అందరికీ తెలుసు. కాబట్టి పూర్వపు పోలిష్ రాజ్యాన్ని పునరుద్ధరించడం అనే జెండా క్రింద యుద్ధం కొనసాగించడం అసంభవం. బ్రిటను ఫ్రాన్సుదేశాలు యుద్ధాన్ని ఆపి శాంతిని పునరుద్ధరించవలె నని కోరడంలేదు. అవి జర్మనీతో యుద్ధం కొనసాగించడానికి కొత్త నెపాలకోసం వెతుకుతున్నాయి.

ఈ యుద్ధాన్ని ప్రోత్సహించే బ్రిటిషువారున్నూ ఫ్రాన్సువారున్నూ జర్మనీమీద చేసే యుద్ధాన్ని ఏదో యొక సిద్ధాంతరూపకమైన యుద్ధంగా నిరూపిస్తున్నారు. అది పాత కాలంనాటి, మతయుద్ధాలను జ్ఞాపకము చేస్తూన్నది. ఇటువంటి

యుద్ధాల్ని సిద్ధాంతం పేరుతో జరపడం అవివేకమే కాక, అపరాధం కూడాను! హిట్లరిజమును వినాశంచేయడానికి పూనుకున్న ఈయుద్ధం ప్రజాస్వామికం చేసే యుద్ధంగా మభ్య పెడుతూన్నారు. కాబట్టి ఈయుద్ధములో ఫ్రాన్సు బ్రిటనుల మూలోద్దేశాలు ఏ సిద్ధాంతమునకూ సంబంధించినవి కావు. వలసరాజ్యాధికారులుగా వారి భౌతిక ప్రయోజనాలను రక్షించుకోవడమే ఈయుద్ధంయొక్క ముఖ్యోద్దేశము.

జర్మనీ కూడా ఈ వలసరాజ్యాలను కోరినందువలన కలిగిన భయమే ఈ యుద్ధానికి మూలకారణం. ఇటీవల వర్సేల్సు సంధి భగ్నమయిన కారణంచేత ఈభయం మరింత యెక్కువయింది. తమ ప్రపంచాధిపత్యము పోతుందనే భయం వలన బ్రిటిషు ఫ్రెంచిపరిపాలకులు జర్మనీతో యుద్ధాన్ని ప్రజ్వలింపచేస్తున్నారు."

ఈ విధంగా ఈ యుద్ధం సామ్రాజ్యవాదయుద్ధ మని కళ్లు తెరచికొని నిజాన్ని తెలుసుకోవాలని కోరేవారందరికీ అర్థమవుతుంది. ఈ యుద్ధంలో ఎవరు ప్రపంచాధికారంకోసం ప్రయత్నం చేస్తోందీ తేలికగా బోధపడుతుంది. ముఖ్యంగా కష్ట జీవులు మాత్రంకాదు. ఈ యుద్ధం కష్టజీవుల కేమీ ప్రయో జనకరమైనదికాదు. వాళ్లెన్నో కష్టాలకూ, త్యాగాలకూ గురి కావలసి ఉంది.

జర్మనీ ఈ యుద్ధంలో జోక్యం కల్పించుకునే పక్షములో మనం తాటస్థ్యంగా ఉండవలసినదిగా సోవియట్ - జర్మన్ నిరాక్రమణసంధివల్ల నిర్ణయింపబడింది. ఈ పద్ధతి మనం

ప్రక్రమంగా అవలంబిస్తున్నాము. పాతపోలాండులోకి మన సైన్యాలు ప్రవేశించడం ఈ నిర్యాక్రమణ సంధి కేవిధంగానూ విరుద్ధంగాదు.''

సోవియట్-జర్మను సంబంధాలను వివరిస్తూ మాల్టావ్ ఇంకా ఏమన్నాడంటే జర్మనీతో మనకు సాధ్యమైన మన స్నేహబాంధవ్యాలు పెంపొందించుకొనే పద్ధతులమీద ఆ దేశపు శాంతి ప్రయత్నాలలో రాజకీయ సహాయం చేయడంవలన మన మిత్రత్వం దినదినాభివృద్ధి పొందుతోంది.

యూరపులో శాంతి చిరస్థాయిగా ఉండాలంటే ఎప్పుడూ జర్మనీ బలవత్తరంగా వుండాలనే మా అభిప్రాయం. జర్మనీని అచేతనంగా చేసి రూపుమాపాలని ఆలోచించడం హాస్యాస్పదం. ఇటువంటి అపాయకరమైన, అవివేకమైన కలలు కంటూ వుండే ప్రభుత్వాలు వర్సెయిల్సు సంధియొక్క విషాద కరమైన అనుభవాన్ని విస్మరిస్తూన్నవి. అవి జర్మనీ అత్యధిక శక్తిని గమనించడంలేదు. అంతే కాదు. వర్సెయిల్సుసంధిని పునరుద్ధరింప ప్రయత్నం చేస్తే నేటి అంతర్జాతీయ పరిస్థితుల్లో వారికే వినాశం కలుగుతుందనే మాటగూడ గ్రహించడంలేదు. 1914 పరిస్థితులకూ, నేటి పరిస్థితులకూ చాలా భేదముంది?

ఈ విధంగా నాడు ప్రకటించిన సోవియట్ ప్రభుత్వం నేడు ప్రపంచ ప్రజానీకంకోసం ఫాసిస్టు వ్యతిరేక పోరాటం చేస్తూన్నదట. లోకమంతా తోడ్పడాలట – కమ్యూనిస్టు లంటారు.

ఇక పోలాండు ప్రభుత్వం పోయింది కాబట్టి, పోలాం డుతో తాముచేసుకున్న నిరాక్రమణసంధికూడ పోయిందనిచెప్పే రష్యావారి వాదం, వారే సరిగ విశ్వసిస్తున్నట్లు లేదు. ఎందు వల్ల నంటారా, వారు సరిగా ఆ వాదాన్ని విశ్వసిస్తున్నట్ల యితే, పోలాండు ప్రభుత్వము పోయిన 22 నెలలకు ఆప్రభుత్వ సభ్యులతో మరొకసంధి సోవియట్ ప్రభుత్వం చేసుకొని ఉండేదికాదు.

జర్మనీ సోవియటు రష్యాపై దండెత్తి వచ్చిన తరువాత 1940 జూలై 30 వ తేదీని సోవియటు రష్యా లండనులో మన్న పోలాండు ప్రభుత్వంతో బ్రిటిషు సామ్రాజ్య ప్రతిని ధుల మధ్యవర్తిత్వాన మరొకసంధి చేసుకొన్నది. ఆ సంధి షరతు లివి.

(1) "పోలాండులోని భూభాగాల మార్పులను గూర్చిన 1939 లోని సోవియట్ జర్మన్ సంధులు రద్దై పోయినట్లుగా సోవియటు రష్యా ప్రభుత్వం గుర్తిస్తున్నది. సోవియటు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉండే యేసంధీ మరొక ప్రభుత్వంతో తాను చేసుకొని యుండలేదని పోలాండు ప్రభుత్వం ప్రకటిస్తున్నది.

(2) ఈ రెండు ప్రభుత్వాల మధ్యా రాజకీయసంబం ధాలు ఈ సంధి పత్రంపైన సంతకాలు జరిగిన వెంటనే పునః రుద్ధరింపబడుతయి. వెంటనే రాయబారులు కూడా రెండు దేశాలకూ పంపబడే ఏర్పాట్లు జరుగుతవి.

(3) హిట్లరుక్రింద ఉన్న జర్మనీకి వ్యతిరేకంగా జరిగే

ఈ యుద్ధంలో అన్నివిధాలా పరస్పరసహాయం చేసుకోవడా నికి ఉభయ ప్రభుత్వాలూ అంగీకరిస్తున్నాయి.

(4) సోవియట్ రష్యా ఒప్పందలతో పోలిష్ ప్రభుత్వంచేత నియమింపబడిన సేనాని క్రింద, ఒక పోలిష్ సైన్యాన్ని సోవియటు రష్యాలో నిర్మించడానికి సోవియట్ ప్రభుత్వం అంగీకరిస్తున్నది. సైనికకార్యనిర్వహణా లన్నిటిలోనూ ఆసైన్యం సోవియట్ రష్యా సర్వసైన్యాధికారులకు లోబడియుండాలి. ఈ సైన్యాధికారవర్గంలో పోలిష్ సైన్యానికికూడ ప్రాతినిధ్యం ఉంటుంది. ఈ సైన్యానికి సంబంధించిన నాయకత్వము, నిర్మాణం, పనిచేయవలసిన చోటు మొదలగు వివరాలుముందు మరొక ఒడంబడికలో నిర్ణయించుకొనబడుతవి.

ఈ ఒడంబడిక ఫలితంగా సోవియట్ రష్యాలోనున్న 500,000 పోలిష్ సామాన్య ఖైదీలునూ 100,000 సైనిక, ఖైదీలున్నూ విమదలచేయబడ్డారు.

ఈ ఒడంబడికలో నాలుగవ క్లాజు ననుసరించి వీరిలో ఎక్కువమంది సోవియటు రష్యాపక్షాన యుద్ధం చేయడానికి ఒప్పుకున్నారు. ఈసంధిపత్రమంతా పరిశీలిస్తే పోలాండుపంపిణీని కూర్చిన సోవియట్ జర్మను ఒడంబడికలు రద్దయినట్లున్న దే కాని పోలాండుయొక్క ఏకత్వాన్నిగానీ స్వాతంత్ర్యాన్నిగాని గ్యారంటీ చేసినట్లులేదు. రష్యాకుమాత్రం తన దేశంలో ఉండి తన యాజమాన్యం క్రింద యుద్ధం చేయడానికి కావలసినంత పోలిష్‌సైన్యము లభించింది. ఈ సంధి కంగీకరించక పోలిష్ విదేశాంగమంత్రి జాలెస్కీయున్నూ, మరిద్దరున్నూ పోలిష్

ప్రభుత్వంలోనుండి రాజీనామా యిచ్చారు. విడుదలచేయబడ్డ పోలీష్ సామాన్య ఖైదీల యొక్కయు, మిలిటరీ ఖైదీల యొక్కయూ సంఖ్యలను గమనిస్తే పోలాండు ప్రజల రక్షణ కొరకు రష్యా పోలాండులో ప్రవేశించినదో, లేక బలవంతంగా ఆక్రమించిందో కూడా బోధపడుతుంది. 1939 సెప్టెంబరులో పోలాండు ప్రభుత్వం పోయింది కనుక దానితో చేసుకున్న నిరాక్రమణ సంధికూడా రద్దయిందని వాదించిన రష్యా ప్రభుత్వమే 1941 జూలై 30 వ తేదీని, ఆ పోయిన ప్రభుత్వంతోనే కొత్తసంధి చేసుకుందంటే తమ లాభంకోసం సోవియటురష్యా ప్రభుత్వం ఎన్ని వన్నాగాలైనా వన్నగలదని తెలుస్తూన్నది. మన కమ్యూనిస్టులచేత నిరంతరమూ ప్రపంచ ప్రజానీకాని కాశాజ్యోతి యని శ్లాఘింపబడే సోవియట్ రష్యాప్రభుత్వమున కీ చర్యలు తగినట్లుగా ఉన్నవా అని పాఠకులే ఆలోచించాలి.

పోలాండును రష్యా ఆక్రమించినప్పటికే అక్కడ సోవియటు పద్ధతిని యేర్పాటుచేశారు. కనుక అది తప్పుకాదని కూడా కమ్యూనిష్టులు వాదిస్తారు. ఇటలీ, అబిసీనియా ప్రజలను నాగరికులనుగా చేయడానికి నిజంగా ఉద్దేశించి ఆదేశాన్ని ఆక్రమించినా అది ఆక్రమణే అవుతుంది! ఆక్రమించిన దేశపు పద్ధతు లెంత మంచివైనా వాటి నాక్రమితదేశాలపైన బలవంతంగా రుద్దడం ప్రజాస్వాతంత్ర్య మనిపించుకోదు. కామ్రేడు స్టాలిన్ (1941) లో, 24 వ నవంబరు విప్లవ మహోత్సవము నాడు (24th anniversary of November Revolution) యేమి మాట్లాడాడో చూడండి.

"We have not and cannot have any such war

aims as that of imposing our will and our regime upon the slavonic or other enslaved nations of Europe who are expecting our help. Our aim is to help these nations in the struggle of liberation they are waging against Hitler's tyranny and then to leave it to them quite freely to organise their life or their lands as they think fit. There must be no interference whatever in the internal affairs of other nations."

"మా సహాయానికి ఎదురుచూచే స్లావిక్ జాతిపైన గాని లేక పరాధీనమైన యే యూరోపియన్ జాతిపై నగాని మా అభిప్రాయాలను, మా పరిపాలననూ రుద్దడం మా యుద్ధాశయంకాదు. అటువంటి యుద్ధాశయాలు మాకుండడానికే వీల్లేదు. హిట్లరు దుండగీడుతనమునుండి స్వతంత్రులు కావడానికి ఆయాజాతులు చేసేయుద్ధంలో వారికి సహాయపడి, వారిదేశాలలో వారిష్టంవచ్చిన పద్ధతిని వారి జీవితాలను స్వతంత్రంగా దిద్దుకోనివ్వడమే మా ఆశయము. ఇతరజాతుల ఆంతరంగిక వ్యవహారాలలో యెటువంటి జోక్యమూ కలిగించుకోరాదనే మా అభిప్రాయము."

1941 నవంబరులో అనగా హిట్లరు రష్యాపై దాడి వెడలిన అయిదు నెలలకు స్టాలిన్ మాట్లాడిన మాటలను బట్టే; 1939 లో సోవియట్ రష్యా పోలాండుపైన చేసిన దండయాత్ర కానీ, అక్కడ స్థాపించిన ప్రభుత్వముకానీ సమర్థనీయములు కావనేమాట స్పష్టము.

పోలాండు ప్రభుత్వానికి సహాయపడడానికి తమ సైన్యాలను పోలాండుకు పంపుతామని రష్యా చెప్పినపుడు,

పోలాండు ఒప్పుకోలేదనీ, బ్రిటను ఫ్రాన్సు దేశాలు పోలాండు ప్రభుత్వాన్ని అందుకు ఒప్పుకొనేటట్టుగా బలవంత పెట్టలేదనీ అందువల్లనే పోలాండు కీ అవస్థ పట్టిందనీ కమ్యూనిస్టు మిత్రు లంటారు. అసలు నిజమేమిటంటే పోలాండు ప్రభుత్వం తమకు కావలసిన విమానదళాలనూ; టాంకులనూ, తదితర యుద్ధ సామగ్రినీ, యుద్ధశాస్త్రజ్ఞులను రష్యానుండి తెప్పించుకోడానికి ఒప్పుకున్నది. కాని రష్యా సైన్యాలు తమ దేశంలోకి రావ డానికి మాత్రం ఒప్పుకోలేదు. 1920 లో సోవియట్ రష్యాకూ తమకూ యుద్ధం జరిగినది కనుక రష్యా సైన్యాలు తిరిగి తమ దేశములోకి రావడమంటే పోలాండు ప్రభుత్వానికి భయ ముండడం తప్పుకాదు. రష్యాకు నిజంగా ఫాసిస్టు ఆక్రమణను ఆపవలెననే కోరికే ఉంటే పోలాండు కోరిన సహాయమే ఆ దేశానికి పంపేది. హిట్లరు యుద్ధము సాగిస్తే తాను తట స్థంగా ఉంటాననే నిరాక్రమణ సంధి ఆయనతో చేసుకుని ఉండేదికాదు.

పోలాండుకు కల్గిన భయం నిజమైనదో లేదో తరువాత రష్యాజరిపిన సంఘటనలబట్టి అందరికీ తెలియనే తెలిసింది.

తూర్పుపోలాండులో సోవియట్ రష్యా ఆక్రమించిన భాగం పూర్వం రష్యాలోదే కనుక మళ్ళీ రష్యా ఆ భాగా న్నాక్రమించడం తప్పు కాదనికూడా కమ్యూనిస్టులు వాది స్తారు. ఈ వాదం కేవలం హిట్లరు ఆస్ట్రియా, జె స్లొవేకియా, మెమెల్, పోలాండులపైన చేసిన ఆక్రమణలను పరోక్షంగా సమర్థించడమే అవుతుంది.

కాబట్టి సోవియట్ రష్యా చేసిన పోలాండుఆక్రమణను ఏ విధంగానూ ఒప్పుకోడానికి వీల్లేదు.

## నేటి పోలాండు - రష్యాల తగాదా

1939 లోనే పోయినదని చెప్పబడిన లండనులోని పోలాండు ప్రభుత్వంతో, సోవియట్ రష్యా 1941 జూలై 30 వ తేదీని చేసుకున్న సంధి షరతుల ప్రకారం పోలాండు కూడా రష్యాకు మిత్రమండలి లోనిదే అయింది. తరువాత 1941 డిసెంబరు 4 వ తేదీని సోవియట్ రష్యా - పోలాండుల మధ్య మఱియొక ఒడంబడిక జరిగినది. ఈ రెండు ఒడంబడికల ప్రకారము పోలాండు తాను నిర్వర్తించవలసిన ధర్మములను సరిగా నిర్వర్తించినట్లుగా పోలిషుప్రభుత్వం ప్రకటిస్తూన్నది. కాని పోలాండుకూ రష్యాకూ మధ్య పాతసరిహద్దుల తగాదా తిరిగి తలయెత్తింది. 1941 జూలై 30 వ తేదీ ఒడంబడిక ప్రకారం, రష్యా జర్మనీలు పోలాండు పంపకము గూర్చి చేసుకున్న ఒడంబడిక రద్దవడంచేత - పోలాండుకు 1939 ఆగస్టు సరిహద్దులు నిలచి ఉన్నట్లుగా పోలాండు ప్రధాని జనరల్ సికోరస్కీ అంటాడు. అలాకాదు, పోలాండు తూర్పుననున్న కొన్ని మిలియనుల ఉక్రేనియనులు, వైటు రష్యనులు, నివసించే భూభాగమంతా, సోవియట్ రష్యాకింద ఉండాలని స్టాలిన్ అంటాడు. ఇది పెద్ద తగాదాగా పరిణమించింది. ఇది ఇలా ఉండగా సోవియట్ రష్యా పోలాండులో ప్రవేశించినపుడు మిలిటరీ ఖైదీలుగా తీసికొన్న 1,81,000 పోలిష్ ఖైదీలలో 8300 మంది పోలిష్‌మిలిటరీ ఆఫీసర్లూ, 7300 మంది N. C. O.

సిపాయీలు, అజాపజా లేకుండా పోయినట్లున్నా -వారిని విడుదల చేయవలసిన బాధ్యత, పోలాండు రష్యాల మధ్య 1941 జూలై 30 తేదీ 11 న జరిగిన సంధి ప్రకారము రష్యా పైనఉన్నది కాబట్టి వారిఉనికినిగూర్చి తగినసంజాయిషీ సోవియట్ ప్రభుత్వం ఈయవలె నని పోలాండు పట్టుపట్టింది. వీరందరూ రష్యాప్రభుత్వం చేతిలో హాతులైనారని జర్మనీ ప్రచారం చేస్తున్నది. జర్మనీచేతిలో హాతులైనారని రష్యాప్రచారం చేస్తూన్నది. శత్రువైన జర్మనీ దురుద్దేశంతో చేస్తూన్న ప్రచారం తాము విశ్వసించ బోవడము లేదని పోలాండుప్రభుత్వం ప్రకటిస్తున్నది. ఈసందర్భములో న్యాయవిచారణకోసం అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంఘంవారిని పోలాండు కోరింది. జర్మనీ అంగీకరించినది. కాని రష్యా మండిపోయి పోలాండులో 25-4-43 న (Diplomatic relations) రాజకీయ బాంధవ్యాలను రద్దుచేసుకొన్నది. పోలాండు ఉద్యోగులు రష్యాలో జర్మనీ పక్షాన గూఢచారులుగా పనిచేస్తున్నారని నిందించింది. పోలాండులో (Diplomatic relations) రాజకీయ బాంధవ్యాలను రద్దుచేసుకొనేటప్పుడు రష్యా తన ముఖ్యమిత్రులైన బ్రిటనుతో గాని, అమెరికాతోగాని మాటమాత్రమైనా చెప్పలేదు. పోలాండు ఉద్యోగులు చేస్తూన్న జర్మను గూఢచారిత్వమును గూర్చి రష్యా ఆకస్మికముగా బయటపెట్టింది. పోలాండు తన పరిహద్దులను గూర్చిగానీ, మిలిటరీ,ఉద్యోగుల ఉనికిని గూర్చిన సంజాయిషీనిగానీ అడుగకముందే నేరమును రష్యా మోపినట్లయితే ప్రపంచం నమ్మడానికి వీలుండేది. అంతేకాదు. పోలాండు ప్రభుత్వం నేడు లండనులో బ్రిటను సంరక్షణక్రింద

ఉన్నది. పోలాండు సంరక్షణకోసం జర్మనీ వ్యతిరేకంగా యుద్ధం చేయడానికి బ్రిటను మొట్టమొదట గ్యారంటీ యిచ్చింది. బ్రిటను మధ్యవర్తిత్వం వల్లనే రష్యాకూ పోలాండుకూ సంధి కుదిరింది. జర్మనీ ముందుగా పోలండుపైకి దూకకపోతే పోలండు కీ గతి పట్టేదికాదు. ఈ విషయాలన్నీ జ్ఞాపకం ఉంచుకుంటే, పోలండు ప్రభుత్వం తాను బ్రిటనులో నివసిస్తూ బ్రిటనుకు ప్రబలశత్రువైన జర్మనీకి అనుకూలంగా, బ్రిటనుకు మిత్రమైన సోవియటు రష్యాలో తన ఉద్యోగులద్వారా గూఢ చారిత్వం చేయిస్తూందని యెంతవరకు నమ్మవచ్చునో పాఠకులే ఆలోచించండి.

పోలాండుకూ రష్యాకూ మఱొక తగాదా కూడా వుంది. బ్రిటనులోనూ, మధ్యప్రాచ్య దేశాలలోనూ యుద్ధంలో చిక్కుకొని యున్న అనేక వేలమంది పోలిష్ సైనికుల కుటుంబాలు సోవియట్ రష్యాలో దూరప్రదేశాలకు పంపబడ్డవి. ఆ కుటుంబాలలో వేలకొలదీ తల్లిదండ్రులు లేని పిల్లలున్నారు. అంతేకాదు, సైనికశిక్షణమునకు యోగ్యులైన యువకులుగూడా ఉన్నారు. జర్మనీవారు పోలాండులో దిగినప్పుడు వేలకొలదీ ప్రజలను హత్యచేశారు. అటువంటి సందర్భంలో పోలిష్‌జాతి జీవించాలంటే రష్యాలో నిరోధించబడిన పోలిష్ స్త్రీలనూ, బిడ్డలనూ, యువకులనూ, పోలీష్‌ప్రభుత్వాధీనం చేయవలెనని పోలాండు కోరుతున్నది. పోలీష్ పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించే బాధ్యత పోలాండుప్రభుత్వమే వహించవలెనని పోలాండు మంత్రుల అభిలాష.

ఇప్పటికీ, అనగా రష్యా పోలాండుతో Diplomatic

relations) రాజకీయబాంధవ్యాలు తెంచుకొన్న 25-4-43 నాటికి రష్యా పోలాండుల మధ్య మూడు ముఖ్యమైన తగాదాలు ప్రబలినట్లుగా తేలింది.

(1) పోలాండు సరిహద్దులు యుద్ధానంతరం 1939 ఆగస్టులో ఉన్నట్లు ఉండవలెనా లేక రష్యా కోరికప్రకారం ఉక్రీన్ వైటురష్యాలు, సోవియటు రష్యాలో చేర్చబడవలెనా?

(2) స్మోలెన్స్క్ ప్రదేశంలో హత్యచేయుబడి అజాపజా లేకుండా పోయినారని చెప్పబడుతూన్న మిలటరీ ఉద్యోగులను గూర్చి అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంఘంవారు విచారణ చేయవలెనా లేదా?

(3) బ్రిటనులోను, మిడిల్ రష్యాలోనూ; యుద్ధరంగంలోనూ పనిచేస్తూన్న పోలిష్ సైన్యాల కుటుంబాలు రష్యాలో నున్నవి కాబట్టి – ఆ కుటుంబాలలోని స్త్రీలు, బాలురూ, యువకులూ పోలిష్ ప్రభుత్వస్వాధీనము చేయబడవలెనా లేదా అని.

మొదటి విషయానికి క్రిందటి యూరోపు సంగ్రామానంతరమున నిర్ణయింపబడిన కర్జను లైను ప్రకారము, పోలండు సరిహద్దులుండవలెననీ, పోలండు కింకేమైనా ప్రదేశం కావలెనంటే జర్మనీకి చెందిన భాగం కొంత యిప్పిస్తామని సోవియటు రష్యా అంటుంది. సోవియట్ పత్రికలు తను మెల్లలనుగూర్చి పంచాయతీ చేయడానికి తమకు మిత్రదేశాలైనప్పటికీ బ్రిటనుకు గాని, అమెరికాకుగానీ హక్కులేదనీ ఘంటాపథంగా వ్రాస్తున్నాయి. బ్రిటను అమెరికాలీ విషయంలో పోలాండు రష్యాకు

ఏవిధంగానైనా రాజీచేయాలని చూస్తున్నవి. కాని వాటి మధ్యవర్తిత్వము రష్యా అంగీకరించేటట్టులేదు. పోలాండు రక్షణకోసం కంకణం కట్టుకొని యుద్ధం ప్రారంభించిన బ్రిటను తన మిత్రదేశాలలో ఒకటైన సోవియటు రష్యావల్లనే పోలాండుకు పతనం కలిగితే జర్మనీతో విజయం పొందిగూడ ఎలా హాస్యాస్పదంగా నలుగురిలో తలయెత్తుకొని తగుదునమ్మా అని తిరుగుతుందో చూడాలి.

ఇక రెండవది - స్మోలెన్స్కు ప్రదేశములో పోలిష్ మిలిటరీ ఉద్యోగుల హత్యలను గూర్చి అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంఘువిచారణకు రష్యా అంగీకరించలేదని యిదివరకే వ్రాశాము. ఆ సందర్భములో పోలాండుతో రష్యా (Diplomatic relations) కూడా రాజకార్యబాంధవ్యంకూడా తెంచుకొన్నదని వ్రాశాము. ఇందుకు రష్యా చెప్పే కారణ మిది.

"స్మోలెన్స్కు ప్రదేశం జర్మనీ చేతులలో నున్నదనీ, ఆకారణంచేత జర్మనీ సోవియటు రష్యా పరోక్షంలో రష్యాకు వ్యతిరేకంగా యే నేరాన్నయినా ఋజువు చేయగలదు, కాబట్టి అటువంటి విచారణకు తామంగీకరించలేమని." ఈకారణం చెప్పి రష్యా మర్యాదగా ఊరుకుంటే బాగుండేది. అంతేకాదు; తన నిర్దోషిత్వాన్ని ధ్రువపరచుకోవడానికి మరొకసూచన యేదైనా చేసినా బాగుండేది. అదేదీ లేక తక్కిన మిత్రరాజ్యాలకు చెప్పకుండా పోలిష్ రాయబారులు రష్యాలో జర్మనీ పక్షాన గూఢచారులుగా ప్రవర్తిస్తున్నారని నిందమోపి పోలాండుతో హఠాత్తుగా

రాజకార్య బాంధవ్యాన్ని తెంచుకోవడం సందేహానికి కారణ మవుతూన్నది. ఏది ఏమైనాప్పా జరిగిందేదో జరిగిందని పోలాండు ఈవిచారణను వదులుకొన్నది.

ఇక మూడో విషయం— పోలిష్ సైనిక కుటుంబాలను పోలాండు ప్రభుత్వరక్షణ క్రింద ఉంచడమును గూర్చినది. 1940–41 లో సుమారు 1,500,000 పోలిష్ జనసంఖ్య రష్యా లోని దూరప్రదేశములకు (deported) పంపబడ్డారు. వారి రక్షణ యేర్పాట్లు పోలిష్ప్రభుత్వం చేసుకొనేటట్లు సావకాశం కల్పింపబడవలెనని పోలాండు కోరింది. వారి సంఖ్య పోలాండు చెప్పినంతగా లేదనీ, చాలా తక్కువనీ సోవియట్ ప్రభుత్వం అంటుంది. రష్యాలో ఎక్కడో ఒక మూలకు వారు పంప బడడంచేత అక్కడ శీతోష్ణ స్థితిగతులను బట్టి సరియైన రక్షణ లేకుండడము వలన చాలామంది మరణించి ఉంటారని కూడా తమకు తెలుసుననీ, రష్యాలోని పోలాండు రాయబారవర్గము రద్దుచేయబడగా ఇదివరకున్న కాన్సరక్షణా కూడా పోయిందనీ అందువలన వారి రక్షణకు తగిన యేర్పాట్లు చేయడానికి తగిన హక్కు తమకే ఉన్నదనీ పోలాండుప్రభుత్వ మంటుంది. దీనికి కూడా రష్యా తగిన సమాధాన మిచ్చినట్లు కన్పట్టదు.

## బాల్టిక్ రాజ్యాల ఆక్రమణ

1939 సెప్టెంబరు 17 న జరిగిన పోలాండు ఆక్రమణ తరువాత దాదాపు నేటివరకూ పోలాండు రష్యాల మధ్య జరుగుతున్న ప్రధానసైనిక రాజకీయ పరివర్తనములను పైన సంగ్రహముగా ఉదాహరించినాము. ఇక ఈ దిగువ 1939

నుండి యిప్పటివరకూ రష్యా మధ్యనూ, బాల్టిక్ రాజ్యాల మధ్యనూ, తటస్థించిన ముఖ్యరాజకీయ సైనిక పరిణామములను ఉదాహరిస్తున్నాము.

బాల్టిక్ రాజ్యాలు :—స్టాలిన్ హిట్లరుతో చేసుకున్న నిరాక్రమణ సంధి ఆయన చెప్పినట్లుగా కేవలం తన పితృదేశ సంరక్షణార్థమే కాదనీ, తూర్పు పోలాండును ఆక్రమించి బాల్టిక్ రాజ్యాలలో ఆధిపత్యం సంపాదించడానికనీ ఇదివరకే వ్రాసివున్నాము.

పోలాండు నాక్రమించుకున్న తరువాత స్టాలిను దృష్టి బాల్టిక్ రాజ్యాల వైపుకు తిరిగింది. అయితే ఫిన్లండులో తనకు కావలసిన ముఖ్యభాగాలను ఆక్రమించవలెననే కోరిక మాత్రం ఆయన కంతకు పూర్వమే ఉన్నది. 1939 మార్చి 15 వ తేదీన హిట్లరు జెకోస్లోవేకియా (బొహీమియా స్లోవేకియా)ను ఆక్రమించే సరికి పోలాండు పైన కూడా వెంటనే పడతాడని ఛాంబర్లేను భయపడి సోవియటు రష్యాతో సంప్రదించకుండానే మార్చి 31 వ తేదీన జర్మనీకి వ్యతిరేకంగా పోలాండు స్వాతంత్ర్యాన్ని గ్యారంటీ చేశాడు. హామీయిచ్చాడు. అంతే కాదు. ముసోలినీ 7 ఏప్రియల్‌న ఆల్బేనియాను పట్టుకునే సరికి 13 వ తేదీని గ్రీసుకు, రుమేనియాలకు కూడా హామీ యిచ్చాడు. ఈ గ్యారంటీ ఫలోన్ముఖం కావాలంటే సోవియటు రష్యా సహాయంకూడా అవసరం. కాబట్టి యింగ్లాండు ప్రభుత్వం 1939 ఏప్రియల్ 15 వ తేదీనే సోవియటు రష్యాతో కలసి జర్మనీకి వ్యతిరేకంగా సంయుక్తసంఘటనం యేర్పాటు చేయడానికి ప్రయత్నాలు సాగించింది. ఇంతకు పూర్వం

సోవియట్ రష్యాకూడా 1939 మార్చి 10 వ తేదీ సైతము, యింగ్లాండు ఫ్రాన్సులతో సంయుక్తసంఘటనానికి అనుకూలంగా మాట్లాడుతూ వచ్చింది. సోవియట్ యూనియన్ కమ్యూనిష్టు పార్టీ కిచ్చిన ఉపన్యాసంలో తమ విదేశాంగ రాజనీతిని గూర్చి స్టాలిన్,

"We stand for the support of the Nations which are the victims of aggression and are fighting for the independence of their country."

"దురాక్రమణకు గురియైనట్టివిన్ని, స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నట్టివిన్ని దేశాలకు సహాయం చేయడానికి కంకణం కట్టుకొన్నాము" అని చెప్పినాడు.

ఈ మాటలను అక్షరాలా నమ్మికూడా మార్చి 31 వ తేదీని పోలాండుకున్నూ, ఏప్రిల్ 13 వ తేదీని గ్రీసు రుమేనియాలకున్నూ ఛాంబర్లేను గ్యారంటీ యిచ్చి ఉండవచ్చును. పోలాండు రుమేనియాల కిచ్చిన బ్రిటిషు గ్యారంటీయే రష్యా పశ్చిమ సరిహద్దులకుకూడా గ్యారంటీ అవుతుందని భావించడం ఛాంబర్లేను తప్పుకాదు. ఎందువల్లనంటారా, జర్మనీ పోలాండునుగానీ, రుమేనియానుగానీ ఆక్రమించి రష్యాకు చేరే సరికే, యింగ్లాండు జర్మనీ పైన యుద్ధం ప్రకటించుటకు వీలున్నది గనుక. ఈకారణంవల్లకూడా రష్యా బ్రిటనుతో కలసి వస్తుందని ఛాంబర్లేను నమ్మిఉంటాడు. అందువల్లనే బ్రిటిషు సాంప్రదాయాలకు విరుద్ధంగా కూడా ఈగ్యారంటీ చేయబడ్డది. కాని తీరా పోలాండు రుమేనియాల సందర్భంలో జర్మనీని యెదిరించడానికి సోవియటు రష్యాను కూడ కలిసి రమ్మని బ్రిటిషు

ప్రభుత్వం రాయబారాలు జరిగించే సరికి సోవియటు రష్యా బిజ్జబిగిసింది. 1935 నుండి సోవియటు రష్యా అవలంబించిన "Collective Security" "సమిష్టి సంరక్షణ" "Popular front" "ప్రజాపక్షాల ఐక్యత" అనే నినాదాలను ఈక్లిష్టసమయంలో విడచి వేసింది. పైపెచ్చు జర్మనీతో సోవియటు రష్యా సంధి చేసుకున్నది. ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలకూ రష్యాకు సంధి కుదరకపోవడానికి అనేక చిన్న చిన్న కారణాలున్నవి. కాని అసలు ముఖ్యకారణం రష్యా విదేశాంగమంత్రి మాల్టావ్ ఒక వుపన్యాసంలో (1939 సెప్టెంబరు) భావగర్భితంగా బయట పెట్టారు. "సోవియటు రష్యా చేసే సహాయానికి బదులుగా ఫ్రాన్సు యింగ్లాండు దేశాలు సోవియటు పైనవచ్చే ఆక్రమణను నిరోధించడానికిన్ని, సోవియటుతో సైనికమిత్రత్వం కలిగి ఉండడానికిన్ని ఒక పక్క బాధ్యత వహిస్తూ మరో ప్రక్క "పరోక్షంగా వచ్చే దండయాత్ర" "Indirect Aggression" లను గూర్చి సోవియటు రష్యాకు గ్యారంటీ యివ్వడానికి, ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలు న్యాయసంబంధములైన మామూలు కారణాలేవో చెప్పి అడ్డంకులు కల్పించినవి. కాబట్టి అవి వాగ్దానం చేసిన మిలిటరీ సహాయం కూడా వట్టి బూటకంగా మారిపోయింది. అందువల్ల సోవియటు రష్యా, ఒంటరిగా ఆక్రమణకు గురి కావలసివస్తుంది."

పరోక్షదండయాత్రలకు ఇంగ్లాండు ఫ్రాన్సులు గ్యారంటీ చేయకపోవడంవల్ల ముఖ్యంగా తమకూ, ఆ దేశాలకూ మధ్య సంధి కుదరలేదని మాల్టావ్ చెబుతున్నాడు. కాబట్టి "ఈ పరోక్షదండయాత్ర లంటే యేమిటో అర్థం ఆలో

చించాలి. దీనిని గూర్చి 14 సం॥ సోవియటురష్యాలో వుండి సోవియటు విదేశాంగరాజనీతిపైన రెండుసంపుటాలలో "Soviets in World Affairs" (ప్రపంచవ్యవహారాలలో సోవియటులు) అనే గ్రంథం వ్రాసిన సుప్రసిద్ధ అమెరికన్ గ్రంథకర్త లూయీఫిషర్ చేసిన వ్యాఖ్యానాన్ని యిక్కడ వుదాహరిస్తాము.

'ఈ పరోక్షదండయాత్ర' అనే పదం, బాల్టిక్ వ్యవహారాలలో సోవియటురష్యా కలిగించుకునే జోక్యాన్ని తెలివిగా మరుగు పరచడానికి పనికి వస్తుంది. తమ ప్రక్కనున్న చిన్నచిన్న బాల్టిక్ రాజ్యములలో కలిగే కొన్ని రాజకీయపరివర్తనాలు తమ శత్రువులు బాల్టిక్ దేశాలుగుండా తమపైన ఆక్రమణచేయడాని కుపయోగ పడుత వని బోల్షివిక్కు లంటారు. హెలెసింకీ, టాలిన్-రీగా, కోవ్నొనగరాలలో మంత్రివర్గము మారినా, ఒక విదేశాంగమంత్రి మారి మఱొకరు వచ్చినా వారందరూ జర్మనీపక్షంవారుగానీ, దుర్బలులనిగానీ, సోవియటురష్యా చెప్పవచ్చును. అంతేకాదు, జర్మనీ వీరిద్వారా సోవియట్ రష్యాపైన దండయాత్ర చేయదలచుకొన్న దనికూడ మాస్కో అనుమానించవచ్చును. ఆ ప్రకారమాలోచిస్తే ఈ పైన చెప్పిన వన్నీ పరోక్షదండయాత్రలకు కారణా లవుతవి. కాబట్టి యిటువంటివాటికి తావు లేకుండా చేయా లని మాస్కో కోరింది.

ఈ పరోక్షదండయాత్ర వున్నదా లేదా అనేది నిర్ణయించవలసిన వారు బోల్షివిక్కులే గనుక ఆ యాబాల్టిక్ రాజ్యాలలో జరిగే యే రాజకీయపరివర్తనము వారికి రుచించక

పోయినా రష్యా వారిపైన దండయాత్రచేసి ఆ నాలుగు రాజ్యాలనూ వారు స్వాధీనపరచుకోవచ్చును.” కనుక పరోక్షదండయాత్రలకు “హామీ యివ్వలే దని మాల్టావ్ రాజ్యాలలో అవి తలయెత్తకుండా ఉండడానికి వీలుగా తాము కోరిన భాగమును యింగ్లాండు ఫ్రాన్సు దేశాలు యిప్పించ డానికి ఒప్పుకోలేదన్న మాట, ముఖ్యంగా రష్యాకూ బ్రిటను ఫ్రాన్సులకూ పరస్పరసహాకారసంధి కుదరకపోవడాని కిదే కారణం.

ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాలు పోలాండు రుమేనియా లకు గ్యారంటీ యీయడమును బట్టీ, జర్మనీ ఆంగ్లో – జర్మను నావికసంధినీ, జర్మనీ - పోలిష్ నిరాక్రమణసంధినీ తృణీకరిం చడమును బట్టీ జర్మనీకీ యింగ్లాండు ఫ్రాన్సుదేశాలకు యుద్ధము తప్ప దని సోవియటురష్యా గ్రహించ గలి గింది. ఇంతకు పూర్వము సోవియటురష్యావల్ల యూరోపి యన్ ప్రభుత్వాలకు ఆపత్తువుం దని జర్మనీ, నాజీ జర్మనీవల్ల ఆపత్తువుం దని సోవియటురష్యా, యింగ్లాండు ఫ్రాన్సు దేశా లకు చెప్పి వాటిని వుపయోగించుకోవడానికి వుభయదేశాలూ ప్రయత్నించినవి. కాని నేడు జర్మనీకి, ఇంగ్లండు ఫ్రాన్సు దేశాలు ఎదురు తిరిగినట్లు హిట్లరుకు తెలిసిపోయింది. ఇంగ్లండు ఫ్రాన్సుదేశాలతో సంధి చేసుకున్నందువల్ల పోలాండులోగాని, బాల్టిక్ రాజ్యాలలోగాని తనకు కావలసిన భాగాలు రావని స్టాలిన్‌కు తెలిసిపోయింది. కాబట్టి వుభయులూ యింగ్లాండు ఫ్రాన్సుదేశాలను వదలి పరస్పరలాభం కోసం రాజీపడదలచు

కొన్నారు. అందువల్లనే రెండో కంటివాడికి తెలియకుండా యిద్దరికీ రాజీ కుదిరింది.

ఇదంతా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే సోవియటు రష్యాతో ఆంగ్లో ఫ్రెంచి రాయబారాలు జరుగుతూన్నప్పటి నుండీకూడ బాల్టిక్ రాజ్యాల ఆక్రమణనుగూర్చి సోవియటు రష్యా ఆలోచనలోనే వున్నది. తమకోరిక యెలాసిద్ధిస్తుందా యని యోజించి జర్మనీతో సంధిచేసుకొని పశ్చిమదేశాలన్నీ జర్మనీతో యుద్ధములో మునిగియుండగా యిదే సమయమని లాట్వియా లిథుయేనియా, ఎస్తోనియాలను బెదరించి వాటితో రాజీచేసుకుని సోవియటు ప్రభుత్వము ఆయాదేశాలలోని ముఖ్యభాగాలను ఆక్రమించుకో కలిగింది. ఈ సందర్భములో సోవియట్ రష్యా యెంతత్వరగా వ్యవహరించిందో ఈ క్రింది తేదీలను బట్టి తెలియగలదు.

పోలాండు పడిపోయింది. 1939 సెప్టెంబరు 28 వ తారీఖున ఆ నాడీపోలాండులో తమ యిరువురి సరిహద్దులను గూర్చి హిట్లరుతో రాజీచేసుకున్నాడు. స్టాలిన్ ఆ నా డీ సోవియటురష్యాకు, ఎస్తోనియాకు సంధి కుదిరింది.

అక్టోబరు 1939 లిట్వియాకు, రష్యాకు సంధి కుదిరింది.

అక్టోబరు 12, 1939 లిథుయేనియాకూ రష్యాకూ సంధి. పోలెండులోకి సోవియటుసైన్యాలు ప్రవేశించిన 25 రోజులలో పోలాండులో సగమూ, ఎస్తోనియా, లాట్వియా, లిథుయేనియాలలో తనకు కావలసిన ముఖ్యభాగాలూ అధికారమూ కూడా సులువుగా సంపాదించ గలిగింది సోవియటు రష్యా.

ఈ విజయోత్సాహంలోనే మాల్టావ్ అక్టోబరు 31 న సుప్రీమ్‌సోవియటుకౌన్సిలులో ఉపన్యసిస్తూ "తక్కిన బాల్టిక్ రాజ్యాలను కోరినట్లుగానే ఫిన్లండును సోవియటు రష్యాతో పరస్పరసహకార సంధి చేసుకోవలసిందిగా కోరాము. కాని ఫిన్లండు ఒప్పుకోలేదు. లెనిన్‌గ్రాడ్ ప్రాంతాల సరిహద్దులకు దూరంగా కొన్ని కిలోమీటర్లు వెనుకకు పోవలసిన దని సోవియటు ప్రభుత్వము ఫిన్లాండును కోరింది. అందుకు బదులుగా కరేలియాలో కొంతభాగం తీసుకో మన్నాము. ఫిన్లండు గల్ఫ్‌లో నౌకాశ్రయాలు నిర్మించుకోవడానికి కొన్ని ప్రదేశాలు సోవియటుప్రభుత్వము కావా లన్నది. రష్యా కోరిన కోరికలో కొంత మాత్రము ఫిన్లాండు యీయడాని కంగీకరించింది. సోవియటు తన సూచనలను మార్చింది. కాని ఫిన్నులు సోవియటు కోరికలను యింకా అంగీకరించక పోయినట్లయితే శాంతికి హాని కలుగతుం"దన్నాడు. సోవియటు రష్యా కోరిన షరతులను ఫిన్లాండు అంగీకరించక పోతే యుద్ధం చేస్తా మనే కదా దీనిభావం. ఇది దౌర్జన్యము కాక పోతే ఇంకేది దౌర్జన్య మౌతుంది?

ఫిన్లాండులో సోవియటురష్యా కావా లని కోరిన ప్రదేశా లన్నీ కేవలము ఫిన్లాండు ద్వారా వచ్చే శత్రుదాడుల నుండి సంరక్షించుకోవడానికే యుద్దేశింపబడిన వని సోవియటు మిత్రు లంటారు. ఇది నిజమా అని ఆలోచించాలి.

యుద్ధం ప్రారంభం కాకపూర్వము ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలు సోవియటురష్యా రాయబారాలు నడిపినప్పుడు, సోవియటు రష్యా ఫిన్లాండులో తా నిప్పుడు కోరిన భాగాలను

ఇప్పించవలసిం దని, అప్పుడే వారిని కోరింది. అప్పుడు ఫిన్లాండును ఆధారంగా చేసుకుని జర్మనీ తనపైన పడవచ్చును కనుక ఆదేశములోని ఆయువుపట్టులు కొన్ని తన కిప్పించ వలసిందని కోరింది. కాని ఇపుడు (1939 అక్టోబరులో) జర్మనీకీ తనతో స్నేహం కుదిరివుంది. ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలు జర్మనీతో యుద్ధంలో మునిగి ఉన్నవి. కాబట్టి యిపుడు ఫిన్లాండువలన తన కుపద్రవము రానున్న దనికాని, ఫిన్లాండు ద్వారా యితరు లుపద్రవములుగజేస్తా రనికానీ సోవియటు రష్యా భయపడ డానికి బొత్తిగా కారణము కనుపించదు. తక్కిన బాల్టిక్ రాజ్యాలలో ప్రధానస్థానాలను సంపాదించి నట్లుగానే ఫిన్లాండులో కూడా ప్రముఖ్యప్రదేశాలను ఆక్ర మించడానికిదే సమయ మని సోవియట్ రష్యాకు తోచింది. సోవియటురష్యావంటి పెద్దదేశాన్ని ఫిన్లాండు ఎదిరించలే దని రష్యాకు తెలుసు. హిట్లరు తనకు ఈడూ జోడూ అయిన మిత్రుడే అయిపోయె. ఇంగ్లండు ఫ్రాన్సు దేశాలు యుద్ధంలో తల మున్కలుగా ఉన్నవాయె. ఒకవేళ ఆ రెండు దేశాలూ ఫిన్లాండుకు సహాయంచేయా లనుకున్నా ఆ సహాయము నార్వే స్వీడన్లద్వారా రావాలి. ఈ రెండు దేశాలూ హిట్లరుకు జడిసి తటస్థంగా ఉంటవి. ఒకవేళ ఈ రెండుదేశాలే ఏమైనా ఫిన్లాండుకు సహాయము చేయాలనుకున్నా తామూ, హిట్లరూ కలసి ఉండడముచేత ఆ సహాయం రహస్యముగా ఉంటుంది. అదికూడా తగినంతగా ఉండదు. కాబట్టి ఫిన్లాండును నొక్కి తనకు కావలసిన స్థానాల సంపాదించడానికిదే సమయ మని సోవియటు ప్రభుత్వము గ్రహించి లెనిన్గ్రాడ్కు ఫిన్లాండు

దగ్గరగా ఉండడం సోవియటురష్యా కుపద్రవకర మని సాకు కల్పించుకుంది. ఈ సందర్భంలో సోవియటురష్యానుగూర్చి అనేక గ్రంథాలు వ్రాసిన అమెరికన్ విలేఖరి, లూయీ ఫిషర్ వాక్యాలను ఉదాహరిస్తా మీ దిగున.

"నేను సోవియటు రష్యాలో 14 ఏండ్లున్నాను. ఏ సోవియటు ప్రచురణలోనూ లెనిన్‌గ్రాడ్‌కు ఫిన్నిష్ మర ఫిరంగుల (artillery) నుండి ఉపద్రవం వున్నట్లు చదువలేదు సరిగదా ఏ సోవియటుఉద్యోగిద్వారానూ విననుకూడా వినలేదు." ఫిన్లాండు స్వాతంత్ర్యదేశమై షుమారు 20 ఏండ్లు అయింది. లెనిన్‌గ్రాడ్ అక్కడే వుంది. ఎన్నడూ లెనిన్‌గ్రాడ్‌కు ఉపద్రవం కలుగలేదు. సోవియటురష్యా బెదరింపులకు జడిసి ఫిన్లాండు లొంగిపోని కారణముచేత తమ యిరువురి మధ్యావున్న నిరాక్రమణ సంధిని 1939 నవంబరు 28 న తృణీకరించి నవంబరు 30 న ఫిన్లాండు పైకి దాడివెడలి ఫిన్నిష్ నగరాలపైన బాంబులు వేసింది. డిసెంబరు రెండవ తేదీని తన చెప్పుచేతలలో నుండే ఆటోకుసినేన్ (Otto kusinen) యాజమాన్యం క్రింద ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని స్థాపించి దానితో ఒక రాజీనామా చేసుకొన్నది. అప్పటినుండీ సోవియటురష్యా విదేశాంగరాజనీతినిగూర్చి ప్రపంచకం లోని సోవియటుఅభిమానులకుకూడా అవిశ్వాసము కలిగింది. ఫిన్లాండువిషయంలో స్టాలిన్ చేసిన ఈపనికీ, హిట్లరు మామూలుగా చేసే ఆక్రమణలకూ భేద మేమిటో మనకమ్యూనిస్టుల నడిగి తెలిసికోవలసినదే. స్టాలిన్ ఫిన్లాండుపైన యుద్ధం సాగించిన రెండుమూడునాళ్లలోనే అనగా 2-12-39 ని తన

చెప్పుచేతలలో నుండే కీలుబొమ్మ ప్రభుత్వము ద్వారా తనకు ఫిన్లాండులో కావలసిన ముఖ్యస్థానాలను వ్రాయించుకున్నప్పటికీ ఆ ప్రభుత్వానికి నిజమైన అధికారము లేదని మాస్కోనుండి అది చేసిన ఈ క్రింది ప్రకటనవల్లనే బోధపడగలదు.

"Our state is not a state of the Soviet type because the Soviet order cannot be established by the efforts of the Govt. alone without the consent of the entire people in particular of the peasantry."

"మా ప్రభుత్వము సోవియటు తరహా ప్రభుత్వము కాదు. యావన్మంది ప్రజల అంగీకారములేనిదే ముఖ్యముగా వ్యవసాయకుల అంగీకారము లేనిదే కేవలము, ప్రభుత్వ ప్రయత్నాలవల్లనే సోవియటు ప్రభుత్వము స్థాపింపబడదు."

దీనిని బట్టి కూసినేన్ ప్రభుత్వానికి ఫిన్లాండులో సోవియటుతరహాప్రభుత్వమును స్థాపించడానికి ప్రజల అంగీకారము లేనందువలన హక్కు కలుగలేదని ఆ ప్రభుత్వమే ఒప్పుకుంటూన్నది. తన దేశముకూ ఎటువంటి ప్రభుత్వము స్థాపించుకోవాలో తాను నిర్ణయించుకొనే హక్కు లేకపోయినప్పుడు సోవియటు రష్యా కోరిన ఫిన్లాండు ఆయువుపట్లులను రష్యా కిచ్చివేయడానికీయన కెలా హక్కు కలిగిందో యోచించండి. ఈ సంధివల్ల లెలిన్‌గ్రాడ్‌పైన మరఫిరంగులు కాల్చడానికి వీలున్నదని చెప్పే కరేలియన్ యిస్తనుస్‌లోని ప్రదేశమేకాకుండా, ఆర్కిటిక్ మహాసముద్రములో లెనిన్‌గ్రాడ్‌కు చాలదూరములో వున్న, యింకా అనేక ప్రదేశాలు కూడా రష్యా కిచ్చివేయబడ్డవి. ఫిన్లాండుగల్ఫులోనున్న హాంగో

మొదలైన అనేక ద్వీపాలు సోవియట్ రష్యాకు లభించినవి. లెనిన్‌గ్రాడ్‌కు ప్రమాదకరముగా నున్నదని చెప్పిన భూభాగము మాత్రం తీసికొని స్టాలిన్ సంతృప్తిపడి వూరుకోలేదు. ఆయన ఫిన్లాండు ఆయువు పట్టులనే తీసుకొన్నాడు. ప్రిట్ తన (Must the war spread) అనే పుస్తకంలో "రష్యా ఫిన్నిష్ ప్రభుత్వముతో రాయబారాలు నడిపినపుడుగాని, లేక ఫిన్లాండులోని కొన్ని భూభాగాలను యిప్పించవలసినదిగా 1939లో బ్రిటను ఫ్రాన్సు దేశాలతో రాయబారాలు నడిపినపుడుగాని, తమ రక్షణకు కావలసిన ముఖ్యప్రదేశాలను మాత్రమే సోవియటులు కోరిఉంటూ" రని వ్రాశాడు. లూయీఫిషర్ Stalin and Hitler "స్టాలినూ, హిట్లరూ" అనే పుస్తకంలో అది సరికా దనీ, ఫిన్లాండు ఆయువుపట్టులను ఫిన్నిష్ కీలుబొమ్మ ప్రభుత్వముచేత స్టాలిన్ వ్రాయించుకున్నా డనీ, కావలసి ఉంటే రష్యాలో 4-12-39న ప్రకటింపబడిన "మాస్కో-న్యూస్" అనే యింగ్లీషుపత్రిక రెండో పేజీలోని ఫిన్లాండు పటము, రష్యా వ్రాయించుకున్న భాగాలను సూచిస్తూ కనుపిస్తుంది; చూడవలసిం దని ఖచ్చితంగా వ్రాశాడు. సోవియటురష్యా చేసిన ఫిన్లాండు ఆక్రమణకు సోవియటు ప్రభుత్వము "League of Nations" అంతర్జాతీయసమితి నుండి వెళ్లగొట్ట బడ్డది కూడాను.

ఈ పై ఆక్రమణలను బట్టి సోవియట్‌రష్యా జర్మనీతో చేసుకున్న నిరాక్రమణసంధి కేవలం తనరక్షణకొరకే కాకుండా క్రొత్త భూభాగాలను సంపాదించడానికి కూడా నని ఋజువు చేశాం. ఇటువంటి ఆక్రమణలకు మాల్టావ్ ఎంత గర్వపడ్డాడో

పోలాండును ఆక్రమించిన తర్వాత ఆయన 1939 అక్టోబరు 31న ఇచ్చిన ఉపన్యాసం లోని ఒకభాగాన్ని ఇక్కడ ఉదాహరిస్తూన్నాను.

"The territory of Poland that has passed to us has an area of 196,000 Sq. Kilometres and a population abut 13,000,000. of whom more than 7,000,000 are Ukrannians and more than 3,000,000 are white Russians and more than I,000,000 Poles, and more tham 1,000,000 Jews".

మాకు పోలాండులోవచ్చిన భూమివైశాల్యం షుమారు 196000 చ॥ కిలోమీటర్లు. అందులో 13,00,000 లక్షలకు జనసంఖ్య వుంది. వారిలో 7,000,000 యుక్రేనియన్లు, 3,000,000 పైగా వైటురష్యన్లు, 1,000,000 పోలులు, 1,000,000 పైగా యూదులున్నారు."

ఇప్పుడు రష్యా, యుద్ధానంతరంకూడా పోలాండులోను బాల్టిక్ రాజ్యాలలోను తాను 1939లో ఆక్రమించిన ప్రదేశాలన్నీ తనకు వచ్చితీరా లంటుంది. ఆ సంగతి స్టాలిన్ రష్యన్ విప్లవజయంతి రోజున 1943 నవంబరు నెలలో స్పష్టంగా చెప్పివేశాడు. అట్లాంటిక్ చార్టరు పైన రష్యాకూడా సంతకం చేసింది. ఈ ప్రకటనతో రష్యాకు సంబంధించినంత వరకు అట్లాంటిక్ ఛార్టరు చింపివేయబడ్డది.

## యూరోపియన్ ఫెడరేషన్లు

పోలాండు ప్రధానమంత్రి సికోరస్కీ యూరపులో తిరిగి యుద్ధాలు రాకుండా ఉండడానికి యూరపు దేశాలు

బలవత్తరముగానూ, శాంతియుతముగానూ ఉండడానికీ ఒక మార్గం సూచించాడు. అది యిది.

"యూరపులోని చిన్నచిన్న దేశాలు కొన్ని కలిసి ఒక్కొక్క ఫెడరేషన్‌గా చేరవలెను. ఆ ఫెడరేషనులోని ప్రతి దేశమూ, తన వ్యక్తిత్వం కోల్పోకుండా ఒక ప్రభుత్వము కలిగి ఉంటుంది. ప్రతి ఫెడరేషనుకూ ఒక కేంద్రప్రభుత్వ ముంటుంది. ఈ కేంద్ర ప్రభుత్వములో ప్రజాపరిపాలనాపద్ధతి ప్రకారం మెన్నుకోబడిన మంత్రు లుంటారు. ఈ మంత్రివర్గమే ఫెడరేషన్‌యొక్క విదేశాంగరాజనీతిని నిర్ణయిస్తుంది. ఫెడరేషనులో నున్న అన్ని దేశాలనుండీ ఫెడరేషనుకు సైన్యము సమకూర్చబడుతుంది. ఫెడరేషనులోని అన్ని దేశాలకూ ఒకటే సైన్యం, ఒకటే విదేశాంగనీతి; ఫెడరేషన్‌లోని ఒక రాజ్యానికీ మరొక రాజ్యానికీ వాణిజ్యనిరోధా లేమీ వుండకూడదు. ఎగుమతి దిగుమతిపన్ను లుండకూడదు. ఫెడరేషన్‌లోని అన్ని రాజ్యాలకూ ఒకే కరెన్సీ ఉండాలి. ఫెడరేషన్ అంతా కలిపి ఒకే (Economic Unit.) ఆర్థిక కేంద్రముగా వ్యవహరించాలి. ఈ విధంగా పోలాండు, జెకోస్లోవేకియా, యుగోస్లోవియా, గ్రీస్ దేశాలు మధ్య ఐరోపాఫెడరేషన్‌గా నిర్మింపబడవచ్చును. స్కాండినేవియన్ దేశాలు ఒక Confederation (కాన్ ఫెడరేషన్)గా వుండవచ్చును. ఐబీరియన్ ఫెడరేష నొకటి నిర్మింపబడవచ్చును. ఫ్రాన్సు, బెల్జియం, హాలండుకూడా ఒక ఫెడరేషను కావచ్చును. ఇందువల్ల ఆ యాచిన్నదేశాలు ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సైనిక విషయాల్లోనూ కూడా తాము బలవత్తరమగుటయే గాక యూరపుశాంతినికూడా

కాపాడగలవని సికోర్‌స్కీ అభిప్రాయం. ముఖ్యంగా సెంట్రల్ యూరోపియన్ ఫెడరేషన్ బాల్టిక్ సముద్రమునుండి మధ్యధరాసముద్రంవరకూ వ్యాపించి ఉండడంచేత జర్మను దురాక్రమణకు అడ్డంకుగా వుంటుం దనీ, సోవియట్‌రష్యా పశ్చిమ సరిహద్దులకు రక్షణగా వుంటుందనీ సికోర్‌స్కీ నమ్మకము.

ఇందుకు సోవియట్‌రష్యా అంగీకరించడం లేదు. మాస్కో కాన్ఫరెన్సులో ఈ విషయం చర్చించబడ్డది. సెంట్రల్ యూరోపియన్ ఫెడరేషన్, తూర్పు యూరోపియన్ ఫెడరేషన్లు సోవియట్ రష్యాకు విరోధంగా (Cordon Sanitaire) ఉద్దేశింపబడిన వని సోవియటురష్యా అంటుంది.

సోవియటు రష్యా సరిహద్దుదేశాల విషయంలో, ఆ దేశపువిదేశాంగ రాజనీతిని బాగా అర్థంచేసుకోవాలి. తన సరిహద్దుదేశాలు చిన్నచిన్న దేశాలుగా వుంటే జర్మను రాక్షసి ఈ చిన్నచిన్న దేశాలను ఆక్రమించి వాటి నాధారంగా (Spring Boards) చేసికొని తన దేశంపైకి ఉరుకుతుం దని రష్యా అంటుంది. ఈ చిన్నదేశా లన్నీ ఫెడరేషనై బలపడతా మంటే ఆ ఫెడరేషన్ తనమీదపడడానికే, తనకు వ్యతిరేకంగా నిర్మింపబడుతూన్న దని అంటుంది. సోవియటురష్యాకూ, జర్మనీకీ మధ్య నున్న ఈ చిన్నిదేశాలు బ్రతకడ మెలాగో బోధపడకున్నది.

మాస్కో కాన్ఫరెన్సులో మిత్రదేశాల మధ్య ఈసమస్య చర్చకు వచ్చినప్పుడు, ఆ యాదేశాల ప్రజాభిప్రాయం తెలుసుకోవడానికి నేటి ఆ ప్రభుత్వాలకు సావకాశం లేదు. కాబట్టి,

అపరాధమూ అన్నవి. అక్టోబరు 9,1939 న "ఇజ్వెస్టియా" వ్రాసిన యీ దిగువ వ్రాతలు చూడండి.

" Every man is free to express his relationship to this or that ideology and has the right to defend or reject it, but it is senseless and stupid crueltyто destroy people, because somebody does not like their views and philosophy of life. That sets us back to the black days of middle ages when costly religious wars were waged in order to annihilate heretics and infidels. But history has demonstrated that such ideological and religious crusades merely led to the extermination of whole generations and to the cultural eclipse of nations. It is impossible do destroy an ideology or philosophy of life by fire and sword. One can respect or hate Hitlerism as one can respect or hate any other system of political thought. That is a matter of taste."

"ఏదో ఒక సిద్ధాంతాని కనుగుణంగా తన అభిప్రాయాన్ని వెల్లడించడానికి ప్రతివానికీ హక్కున్నది. ఆలాగే ఒక సిద్ధాంతాన్ని సమర్థించడానికీ నిరసించడానికీ కూడా అధికారమున్నది, కాని మన అభిప్రాయాలనూ, జీవితసిద్ధాంతాలనూ యెవరో ఒకరు అంగీకరించలేదనే కారణాన ప్రజలను సంహరించడం, అవివేకమూ, బుద్ధిహీనతా, క్రూరత్వమూను. ఈ పద్ధతి మతభ్రష్టులనూ, నాస్తికులనూ నిర్మూలించడానికి జరుపబడిన మతయుద్ధముల మధ్యయుగము నాటికి మనలను తీసుకొని పోతుంది. కాని సిద్ధాంతాల కోసమున్నూ, మతప్రచారాలకోసమున్నూ జరుపబడిన అటువంటి యుద్ధములు ప్రజా

వినాశనమునకూ, విజ్ఞానవినాశనమునకూ మాత్రమే తోడ్పడ గలవు. ఒక సిద్ధాంతాన్నిగానీ, ఒక జీవితాశయమునుగానీ నిప్పుతోనూ, కత్తితోనూ, రూపుమాపడం అసాధ్యం. ఒక మనిషి హిట్లరిజమును గౌరవించనూ వచ్చు, ద్వేషించనూవచ్చు. అలాగే మఱియొకడు మఱియొక రాజకీయ సిద్ధాంతాన్ని గౌర వించనూవచ్చు, ద్వేషించనూవచ్చు. అది వారివారి అభిరుచు లను బట్టి వుంటుంది.” రష్యా జర్మనీలు కలసి వున్నపుడు ఇంత ఔదార్యంగా వ్రాసినవి ఆనాటి సోవియటు పత్రికలు. ప్రపంచములోని కమ్యూనిస్టులందరూకూడ ఆ నాడా వాదానికే తాళంవేశారు. ఈ నాడు జర్మనీ రష్యాలకు పోరాటం కలిగి నప్పుడు మళ్లీ “ఫాసిస్టు వ్యతిరేక పోరాటము చేస్తున్నది ప్రపంచ ప్రజానీకమున కాశాజ్యోతియైన సోవియటు రష్యా” అంటు న్నారు. కమ్యూనిస్టుల ఈ మార్పును చూచి వారి పద్ధతి తెలిసిన వారెవ్వరూ ఆశ్చర్యపడరు. కమ్యూనిస్టులు ప్రపంచ రాజకీయములలో ఎప్పు డెలా వ్యవహరిస్తారో తెలుసుకోవా లంటే “కామింటరన్”ను గురించి కొంత తెలుసుకోవడం మంచిది.

## కా మిం ట ర న్

ఈ సంస్థ 1919 మార్చి నెలలో స్థాపించ బడ్డది. ఇది వివిధ దేశాలలోని విప్లవోద్యమాలనూ అంతర్జాతీయపంథాకు తీసుకొని రావడమున కొక కొలికిపూస వంటిది. ఇది ప్రపంచ ములోని కమ్యూనిస్టుపార్టీల కన్నిటికీ కేంద్రము. మాస్కోలో నున్న ఈ కమ్యూనిస్టు కేంద్రము యొక్క వుత్తర్వుల ననుస రించియే ప్రతిదేశములోని కమ్యూనిస్టుపార్టీ ‘తూ’ ‘చా’ తప్ప

కుండా నడుచుకోవాలి. దీనినే కమ్యూనిస్టు మూడవ ఇంటర్నేషనల్ అనికూడా అంటారు. 24 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా ఈ పద్ధతుల ప్రకారమే ఈ సంస్థ నడిచింది. కాని ప్రపంచ విప్లవముమాట వెనుకబడింది. లెనిన్ ఆశించినట్లు జరుగలేదు. 1922 నాటికే లెనిన్ ఈ సంగతి తెలుసుకొని ఆయాదేశాలలో తగిన పరిస్థితులు లేకపోవడంవల్ల విప్లవోద్యమాలు అపజయం పొందినవన్నాడు తరువాత 1930 నుండీ సోవియటు రష్యా విదేశ రాజ్యతంత్రమునకు అనుకూలంగా కామింటరన్ ఉపయోగపడుతూ వచ్చింది. అంటే రష్యా విదేశాంగ రాజనీతిని కామింటరన్, తద్వారా దాని అనుబంధము లైన ఇతర దేశములలోని కమ్యూనిస్టు పార్టీలు అనవతరమూ సమర్థిస్తూంటవి అన్నమాట. అందువల్ల సోవియటు విదేశరాజ నీతిని బట్టి కమ్యూనిస్టులపంథా వుంటుంది. ఈసంగతి తెలుసుకొంటే కమ్యూనిస్టు లెప్పుడు ఏమాట ఎందుకు చెప్పారో బాగా అర్థమౌతుంది.

జర్మనీ రష్యాలు స్నేహంగా వున్నపుడు (1939 ఆగష్టు 23 మొ॥ 41 జూన్ 22 వరకు) ప్రపంచకంలోని అన్నిదేశాల లోని కమ్యూనిస్టులూ యుద్ధవ్యతిరేకప్రచారం చేశారు. జర్మనీ ఫ్రాన్సు నాక్రమిస్తూ వుంటే ఫ్రెంచికమ్యూనిష్టు లప్పుడు యుద్ధవ్యతిరేకప్రచారం చేశారు. రష్యాకూ, జర్మనీకీ పోరాటం వచ్చిన తరువాత ఇప్పు డెక్కడలేని దేశాభిమానమూ తెచ్చుకొని, వారే ఫ్రాన్సునుండి ఫాసిస్టు పెనుభూతాన్ని వెళ్లగొట్టా లంటారు.

ఫ్రెంచి కమ్యూనిస్టులు ఫ్రెంచి మిలిటరీ బడ్జెట్ల నెదిరిస్తూండేవారు. 1935 మే 2 వ తేదీని ఫ్రాన్సు రష్యాదేశాలు పరస్పరసహాయసంధి (Treaty of friendly assistance) చేసుకున్నవి. పిమ్మట అభివృద్ధినిరోధక ఫ్రెంచిప్రధానమంత్రి లావాల్ మాస్కో వెళ్లినాడు. మాస్కోనుండి మే 15 న ఒక ప్రకటన చేయబడ్డది. అందులో "రక్షణకోసం కావలసినంత సాయుధ సైనికుల నుంచుకోవడంలో, ఫ్రాన్సు అవలంబించిన డిఫెన్సుపద్ధతిని, స్టాలిన్ గ్రహించి అంగీకరిస్తున్నాడు" అనే వాక్యమున్నది. అది గుర్తుగా పెట్టుకొని ఫ్రెంచి కమ్యూనిస్టులు ఫ్రెంచి మిలిటరీ బడ్జెటులను వ్యతిరేకించడం మానుకున్నారు.

బ్రిటిష్ కమ్యూనిస్టులు:—బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి హారీ పాలిట్ యుద్ధం ప్రారంభం కాగానే 1939 సెప్టెంబరు మొదటివారంలో ఈదిగువ విధంగా సర్క్యులర్ పంపించాడు.

"ఈయుద్ధం సామ్రాజ్యవాదయుద్ధం మాట వాస్తవమే కాని, బ్రిటన్ ఫ్రాన్సుదేశాల నేటి పాలకులు, మూడు సంవత్సరాలనుండి ఐరోపాఖండంలో ఒకఆపత్తు తర్వాత మరియొక ఆపత్తును తీసుకొని వస్తూన్న నాజీ దురాక్రమణను మొదటిసారి ఎదుర్కొన పూనుకొన్నారు. కాబట్టి బ్రిటిషు కార్మికులంతా యుద్ధంలో ఈ హిట్లరు నోడించాలి. జర్మను ప్రజలను 6 సంవత్సరాలనుండి హింసిస్తూన్న నాజీ ప్రభుత్వాన్నీ, హిట్లరును నాశనం చేయడం మూలకంగా ఈ యుద్ధాన్ని ముగించడానికి తగిన ప్రయత్నాలను బ్రిటిషు కార్మికవర్గం చేయాలి. ఈ యుద్ధమునకు దూరముగా వుండడమున్నా

యూరపులో ఫాసిస్టు మృగాలు అవిచ్ఛిన్నంగా సంచరిస్తూంటే వట్టి విప్లవనినాదాలతో సంతృప్తి పడడమున్నూ, మన పూర్వులు ధనస్వామికమునకు (Capitalism) వ్యతిరేకంగా యిన్ని సంవత్సరాలనుండీ పోరిన పోరాటమునకు ద్రోహం చేయడమే అవుతుంది." ఈ సర్క్యులరుకు శీర్షిక "How to win the war" (యుద్ధం గెలవడ మెలా) అని.

కానీ ఈ సర్క్యులరు కామింటరన్ వుత్తరువు ప్రకారము 1930 సెప్టెంబరు మధ్యలోనే వుపసంహరించుకో బడ్డది. కామింటరన్ సోవియటు ప్రభుత్వానికి పరికరంగా ఉపయోగ పడుతూన్నపుడు కామింటరన్ ఉత్తరువులంటే సోవియటు ప్రభుత్వపు ఉత్తరువులేనని అర్థం చేసుకోవడం తప్పుకాదు.

తిరిగి ఈ హారీపాలిటుగారే, రష్యాపై జర్మనీ దండయాత్ర సాగించిన తర్వాత, స్టాలిన్ 1941 జూలై 3వ తేదీని చేసిన వుపన్యాసం విని, 8వ జూలైన మరొక ప్రకటన పంపించాడు. అందులో యుద్ధప్రతికూల వాదం విడిచిపెట్టి యుద్ధానికి సంపూర్ణసహాయం చేయవలెనని ప్రోత్సహించాడు. సోవియటు రష్యాపైన ఫాసిస్టుజర్మనీ చేసిన దురాగతంవల్ల ప్రపంచ పరిస్థితులే పరిణామం పొందినయి. కాబట్టి కమ్యూనిస్టులు తమ పంథాను పూర్తిగా మార్చుకుంటున్నారనీ, కనుక బ్రిటనులోని కష్టజీవులంతా ఈయుద్ధానికి సహాయపడి ఫాసిజంను నాశనము చేయాలనీ ఈ ప్రకటనసారాంశం. ఈ ప్రకటన అంతా యథాతథంగా వ్రాసి అందులోని అసందర్భాలనూ, అపార్థములనూ, చూపించాలనే ఆసక్తి కలుగుతూన్నది కాని గ్రంథ విస్తరభీతిచేత విరమింపబడవలసి వచ్చినందుకు విచారపడు

తున్నాను, బ్రిటనులోని కమ్యూనిస్టుపార్టీ యింకా యేవిధంగా సోవియటు రష్యా విదేశరాజనీతికి అనుగుణంగా, లయ తప్పకుండా తాళము వేసినదో చూపించడానికి ఆ దేశములోని కమ్యూనిష్టుపత్రిక "డెయిలీ వర్కరు," హిట్లరూ, స్టాలినూ కలిసి ఉన్నరోజులలో వ్రాసిన వ్రాతలు కొన్ని ఉదహరించి చూపిస్తాను.

ఫిబ్రవరి 1-1940—డెయిలీ వర్కరులో:-"Hitler repeated once again his claim that the war was thrust upon him by Britain. Against this historical fact there is no reply. Britain declared war, not Germany. Attempts were made to end the war, but the Soviet: German Peace overtures were rejected by Britain. All through these months the British and French Governments have had the power to end the war. They have chosen to extend it."

"బ్రిటను బలవంతంగా తనమీాద ఈ యుద్ధాన్ని రుద్దినదని హిట్లరు మరొకసారి అంటున్నాడు. ఈ చరిత్రాత్మక విషయానికి వ్యతిరేకంగా జవాబులేదు. యుద్ధం ప్రకటించింది బ్రిటను, జర్మనీకాదు. యుద్ధాన్ని ముగించడానికి ప్రయత్నాలు జరిగినవి. కాని సోవియట్ జర్మను రాయబారాలను బ్రిటను తిరస్కరించింది. ఇన్నినెలలూ బ్రిటను ఫ్రెన్సు దేశాలకు యుద్ధం ముగించవలెనంటే శక్తిసామర్థ్యాలున్నవి. కాని యుద్ధాన్ని కొనసాగించాలనే వారు నిర్ణయించుకున్నారు."

9-4-40 డెయిలీవర్కరులో

"నేషనల్ ప్రభుత్వం, నార్వేజియన్ తాటస్థ్యాన్ని

భగ్నం చేయ నిశ్చయించుకొన్నది. సమర్థించుకోవడాని కెన్ని నైతికవాదాలను ప్రయోగించినప్పటికీ నార్వేజియన్ సముద్రంలో గనుల నుంచడమువల్ల అంతర్జాతీయన్యాయ మనేది ఆకాశమంత ఎత్తున ఎగిరిపోయినమాట నిజము."

నార్వే, డెన్మార్కులపైన జర్మనీ దండయాత్ర సాగించిన తరువాత 10-4-40న డెయిలీవర్కరులో "ఒక పగలూ, ఒక రాత్రిలో బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వాలు నార్వేజియన్ తాటస్థ్యమును భగ్నంచేసి దాదాపు నూరుమైళ్లవరకూ యుద్ధరంగాన్ని పెంచారు. మఱిరెండు దేశాలు, అనగా నార్వే, డెన్మార్కులు యుద్ధంలో మునిగిపోయినవి. స్వీడనుకు ప్రత్యక్షంగా ముప్పు రానున్నది. బ్రిటను ఫ్రాన్సు దేశాలు, ఆ దేశంపైన తక్షణం దండయాత్ర చేసే సావకాశం కన్పిస్తూన్నది. జరిగిన రాత్రి హాలండు, బెల్జియం దేశాలపైనకూడా బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వాలు చర్యదీసుకోపోత వని ఒక పెద్దవాడుక బయలు దేరింది."

బ్రిటిషు కమ్యూనిష్టుపార్టీ నాయకుడు పామీడత్తు, హైడ్ పార్కులో 15 ఏప్రిల్ 1940న మాట్లాడుతూ "ఈ అపరాధానికి (స్కాండినేవియాకు యుద్ధం వ్యాపించడం) ముఖ్యంగా ఛాంబర్లేన్, రేనాడ్, అట్లీలపైన బాధ్యతపెట్టాలి" అన్నాడు. చూచారా! స్టాలినుకు హిట్లరు స్నేహితుడుగా వుండడంవల్ల యుద్ధ బాధ్యతను హిట్లరునుండి బ్రిటిషు కమ్యూనిస్టులు ఎలా తొలగిస్తున్నారో ?

జర్మనీ రష్యాలకు సంధి కుదిరిన తరువాత అమెరికన్ కమ్యూనిస్టులు జర్మన్ వస్తుబహిష్కారోద్యమాన్ని విరమించు

కొన్నారు. రష్యాకూ, జర్మనీకీ యుద్ధం పొసగిన తరువాత అందరి కమ్యూనిస్టుల వలెనే వారున్నూ ఫాసిస్టురాక్షసిని సంహారించా లంటున్నారు.

## కామింటరన్ రద్దు

ఇంతా వ్రాసిన తరువాత, కామింటరన్ ఉత్తరువుల ప్రకారము ఆ యా దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు నడుచు కొంటవని గదా ఇంతవరకూ చెప్పినది! కామింటరన్ 1943 మే నెలలో రద్దయింది కదా! ఆసంస్థ సోవియట్‌రష్యా విదేశ రాజనీతికి పరికరంగా ఉపయోగపడుతూంటే, దాన్ని రద్దు చేయడంచేత యిక ఆభయంపోయింది కదా! ఇప్పుడన్ని దేశాల కమ్యూనిస్టులకూ ఆయాదేశాల పరిస్థితుల ననుసరించి స్వతంత్రంగా నడచుకోవడానికి హక్కేర్పడ్డది కదా. ఇంకా మనం కమ్యూనిస్టుల నెందుకు సందేహించాలి, అని ఎవరైనా అడుగ వచ్చు. అందువల్ల ఈకామింటరన్ ఎందుకు రద్దు చేయబడిందీ మనం గ్రహించాలి. కామింటరన్‌ను రద్దు చేయడానికి స్టాలిన్ చెప్పిన కారణా లేవంటే 1. కామింటరన్ ద్వారా సోవియట్ రష్యా తన బోల్షివిక్ ప్రచారాన్ని ప్రతిదేశంలోనూ సాగించి బోల్షివిజమును స్థాపించడానికి ప్రయత్నం చేస్తూన్నదని హిట్లరు చేసే ప్రచారాన్ని నిర్మూలించడానికి 2. ఆ యా దేశాల కార్మిక వర్గములలో కూడా కమ్యూనిజమునకు వ్యతిరేకముగా నున్న వారు కమ్యూనిస్టులు తమ మాతృదేశక్షేమమును గమనించకుండా సోవియట్ రష్యానుండి వచ్చే ఉత్తరువుల ననుసరించి ప్రవర్తిస్తారని మోపే అపవాదుల్ని ఖండిం

మాపడానికీ 3. ఆయాదేశాల కమ్యూనిస్టులు తమ దేశాల లోని పరిస్థితుల ననుసరించి, హిట్లరు వ్యతిరేక పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించడానికి, తక్కిన పార్టీలతో చేతులు కలుప వీలుండేదుకూ.

ఈమూడు కారణాలను బట్టీ యిప్పుడు జరిగే యుద్ధంలో తన మధ్యా, మిత్రమండలి దేశాల మధ్యాగానీ, తటస్థదేశా లలోగానీ హిట్లరుఆక్రమిత దేశాలప్రజలలోగానీ తన పైన గల అపోహాలను తొలగించుకుంటే తనకు జయం కలగడానికి వీలుంటుందని స్టాలిన్ అభిప్రాయం. కమ్యూనిస్టులందరూ, అన్ని దేశాలలోనూ కామింటరన్ లాంఛనంగా వున్నా, లేక పోయినా, సోవియట్ రష్యాక్షేమమే ప్రపంచప్రజాక్షేమ మని యిప్పటికీ వాదిస్తున్నారు. అంటే స్టాలిన్, కామింటరన్ రద్దు చేసిన అంతరార్థాన్ని బాగా గమనించా రన్నమాట. రష్యా తన విజయంకోసం యెత్తిన యెత్తుగడ యిది అని వారికి తెలుసు. ఇటువంటి యెత్తులు కమ్యూనిస్టులు ఉగ్గు పాలతో నేర్చుకొంటారు. అందుకోనమే కామింటరన్ పోయినా సోవియట్ రష్యా రాజనీతికి విరుద్ధంగా యేదేశంలోని కమ్యూ నిస్టులూ ప్రవర్తించడంలేదు. పైపెచ్చు శాస్త్రీయంగా యిది రద్దుచేయడం మూలాన వారికి సమాధానం చెప్పుకోడానికి వీలుకలిగింది. ఈ విధంగా స్టాలిన్, బ్రిటను, అమెరికాలలోని పాలకవర్గాలను సంతోషపరిచాడు. తాను నిరాక్రమణసంధి చేసుకొన్న జపానువంటి దేశానికి వ్యతిరేకంగా, ఇండియా, చైనా, డచ్చిండీస్‌లోని కమ్యూనిస్టులు ప్రచారం చేసినప్ప టికీ జపాను తనపైన తప్పు పట్టుకోకుండా ఉండడానికి మార్గ

మేర్పాటు చేసుకొన్నాడు. కాబట్టి కామింటరన్ రద్దు స్టాలిన్‌కూ, మన కమ్యూనిస్టులకూ యెంత బాగా ఉపయోగ పడ్డదో పాఠకులు గ్రహించగలరు.

## చైనా

ఇంతవరకు సోవియట్ రష్యా విషయాన్ని ముగించాం. ఇక చైనా. చైనా యెన్నడూ ప్రపంచప్రజాయుద్ధం చేస్తున్నానన లేదు. చైనా పక్షాన యేయితరులూ ఆ మాట చెప్పలేదు. చైనా తన రక్షణకోసం యుద్ధం చేస్తున్నది. అందుకే ఇండియన్ నేషనల్ కాంగ్రెసు తన సానుభూతిని చూపించింది. పరాధీనస్థితిలో తన చేతనైన సహాయం చేయబూనుకొన్నది. చైనాకు వైద్యసహాయం పంపి తన మిత్రత్వాన్ని ప్రకటించింది.

## అమెరికా

జపాను పెరల్‌హార్బరుపైన పడేటంతవరకూ, అమెరికా యుద్ధంలోకి దిగకుండా ఉండడాని కెంత ప్రయత్నం చేసిందో రాజకీయాలు పరికిస్తున్న వారందరికీ తెలిసిన విషయమే. అంతే కాక ఈ యుద్ధంలో తన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోడానికి కూడా ప్రయత్నించింది. అమెరికానుగురించి గ్రంథం పెంచడం కంటె, రూజువెల్టు చెప్పిన ఒకమాట తెలుసుకొంటే అమెరికా మానసిక తత్వమంతా తెలిసిపోతుంది. చైనా జపానుల కిన్నాళ్ల నుండి యుద్ధము జరుగుతుంటే జపానుకు పెట్రోలు ఎందుకు సప్లయిచేశావని ప్రశ్నవేస్తే రూజువెల్టు చెప్పిన సమాధానమిది. "జపాను కిప్పుడు పెట్రోలవసరం. మనం సప్లై చేయకపోతే అది వచ్చి యీస్టిండీస్ దీవులపైన పెట్రోలుకోసం దండ

యాత్ర చేయక తప్పదు. అప్పుడు మన ఫిలిఫ్ఫైన్ దీవులకు ఆపత్తు వున్నది. ఆ దీవుల్ని రక్షించుకోడానికే నే నీపని చేశాను" అన్నాడు. దీన్ని బట్టి తమ ప్రయోజనాలను రక్షించుకోడానికి అమెరికా జపాన్‌తో చేతులు కలపడాని కేమీ సందేహించ లేదు అని తేల్తూన్నది. అటువంటి అమెరికా ప్రపంచ ప్రజా నీకం కోసం యుద్ధం చేస్తూన్నదంటే యెలా నమ్మడం? ఫిన్లాండును గురించి అమెరికా జోక్యం కలుగచేసుకొని మాట్లాడినప్పుడు సోవియటు విదేశాంగమంత్రి మాలటావ్ అమెరికాను ఎలా ఎత్తిపొడిచాడో మన కమ్యూనిస్టు లొక్క సారి గమనిస్తే బాగుండును. పాపం, బహుశా మాలటావ్ అమెరికా సహాయం తాను పొందవలసి వస్తుందని అప్పటికి అనుకొని వుండడు. "ఫిన్లాండుకు సోవియటు రష్యా స్వాతంత్ర్య మిచ్చింది. అమెరికా ఫిలిప్పైన్ దీవులను తన స్వాధీన ములో వుంచుకొన్నది" అన్నాడు. పాపం అమెరికా కూడా ఫిలిప్పైన్ దీవులు జపాను స్వాధీనంలోకి పోయిన తరువాత వాటి స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది.

## బ్రిటను

ఇంగ్లాండు ప్రజాస్వాతంత్ర్యం కోసం యుద్ధం చేస్తున్నదా లేదా అనడానికి తర్కవితర్కాలు ఇండియాలో అక్కర్లేదు. బ్రిటన్ సదుద్దేశాన్ని తెలుసుకోడానికి ఇండియా ఒరిపిడిరాయి. ఇండియా స్వాతంత్ర్యోద్యమ విషయంలో ఇంగ్లాండు కార్యకలాపమంతా జగద్విదితం. ప్రధానమంత్రి చర్చిలు, ఇండియన్ కమ్యూనిస్టులు కూడా పొరపడకుండా ఉండడానికి "మా సామ్రాజ్యము మేము వదలు కోము" అని

స్పష్టంగా చెప్పాడు. బ్రిటిషు వలసరాజ్యాలమంత్రి "వలస రాజ్యాల పరిపాలన బ్రిటనుచేతులలో వుండాలి" అన్నాడు. అంతర్జాతీయ పరిపాలనలో కూడా ఉండడానికి వీల్లేదన్నాడు. జపాను చేతిక్రిందకు పోయిన బర్మాకూడా, తిరిగి తమ స్వాధీనమైతే, దానిని స్వాతంత్ర్యమార్గంలో పెట్టడానికి సావకాశం కలిగినప్పుడు తగిన సహాయం చేస్తామని ఆశ నందకుండా పోకను పొందకుండా తమ రాజనీతిచాతుర్య మంతా చూపిస్తున్నారు బ్రిటిషు రాజకీయవేత్తలు. ఇటువంటి బ్రిటనుతో రష్యా ఒకప్యాక్టు చేసుకుంది. అది యుద్ధం ముగిసిన తర్వాత 20 సంవత్సరాలవరకూ కూడా అమలులో నుంటుంది. దాని ప్రకారం ఈ రెండు దేశాలూ ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో ఒకరు జోక్యం కలుగచేసుకోనకుండా ఉండడానికి అచ్చుకొన్నవి. ఇండియా బ్రిటన్ యొక్క ఆంతరంగిక వ్యవహారమని ప్రతిరోజూ బ్రిటిషు ప్రభుత్వసభ్యులు చెబుతూవుంటారు. ఇతర మిత్రదేశాలన్నీ - సోవియటు రష్యా తప్ప - ఏదో విధంగా యిండియాను గురించి ఎప్పుడైనా ఒక మంచిమాట అంటే అని వుండవచ్చు. సోవియటు రష్యా మాత్రం పైన వ్రాసిన ప్యాక్టును అక్షరశః గమనిస్తూన్నది. అటువంటి సోవియటు రష్యా విజయంవల్ల ఇండియా బ్రిటిషుసామ్రాజ్యంనుండి స్వాతంత్ర్యం పొందుతుందంటారు మన కమ్యూనిస్టులు. ఎలా నమ్మడం?

ఈపైన చెప్పబడిన సంగతులనుబట్టి ప్రతిదేశమూ తమ స్వప్రయోజనాలకోసమే యుద్ధం చేస్తున్నదని తేలుతూన్నది. సోవియటురష్యా విధానం మరీ విచిత్రంగా కన్పి

స్తూన్నది. తనకూ జర్మనీకీ జరిగే యుద్ధంలో అమెరికా బ్రిటనుల సహాయం పొందుతూన్నది. కాని అమెరికా బ్రిటన్‌లు జపాను పైన చేసే యుద్ధంలో సోవియటు రష్యా కించిత్సహాయమూ చెయ్యకపోవడమే కాక పైపెచ్చు వ్యతిరేకంగా కూడ ప్రవర్తి స్తూన్నది. సోవియటు రష్యా ఇంగ్లండును యూరపులో రెండోరంగము పెట్టమని వత్తిడి చేస్తుంది. జపాను మీద దండయాత్ర చేయడానికి రష్యాలోని విమానాశ్రయాలు, నౌకాశ్రయాలు అరువిమ్మని కోరితే, అమ్మో కాదంటుంది. టోకియో పైన బాంబులు వేసిన అమెరికన్ విమానములు సైబీరియాలో గుండా ఎగురుతూ క్రిందపడితే వాటిలోని విమానచోదకులను బంధించింది. ఇదంతా స్వసంరక్షణ కోసం చేస్తూన్నదని మన మిత్రులంటారు. స్వసంరక్షణ తప్పు కా దంటాము మేమూను. కాని సోవియటు రక్షణే మనరక్షణ అను కోవడం కూడదంటాం మన కమ్యూనిష్టు మిత్రుల్ని. వారికి సోవియటు రక్షణ మనరక్షణకాదని తెలుసు. ఇండియన్ కమ్యూ నిస్టులకు హిందూదేశ స్వాతంత్ర్యంకంటె సోవియటు విజయం ముఖ్యం. సోవియటు రష్యాను జపాను రెండోవైపు ఎదుర్కొ న్నట్లయితే ప్రమాద ముందని వారికి తెలుసు, కాబట్టి జపాను సోవియటురష్యాపైకి పోకుండా ఏదేశంతో పోరాటంలో చిక్కుకున్నా కమ్యూనిస్టుల కిష్టమే. పసిఫిక్కురంగంలో జపాను యుద్ధంలోకి దిగే సరికి జపాను నారంగమునుండి తప్పించుకొని వెనుకకు పోయి రష్యాను కొట్టడానికి వీలులేకుండా చేయాలని ఇండియన్ కమ్యూనిష్టులకు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ ద్వారా సోవియటు రష్యానుండి తాకీదులు వచ్చినట్లు కనిపిస్తూన్నది.

అందువల్లనే జర్మనీ రష్యాపై దండయాత్ర చేసిన 1941 జూన్ 22 వ తేదీనుండి గాక, 41 డిసెంబరు మొదటివారం నుండీ మన కమ్యూనిస్టులు ప్రజాయుద్ధమని ప్రచారము చేస్తూ జపాను వ్యతిరేకరంగాన్ని బలపరుస్తూ సోవియటు రష్యాపైకి జపాను పోకుండా కాపాడుకొంటున్నారు. ఇండియన్ కమ్యూనిస్టుల జపానువ్యతిరేకనినాదాలలో సోవియటు రష్యా క్షేమమే గూఢలక్ష్యంగా ఉన్నది. కాని వారు పైకి చిలుకపలుకలవలె పలికే హిందూదేశ స్వాతంత్ర్యము, రక్షణలు వారి ఆశయములుకావు. అవే వారి లక్ష్యము లయితే యిండియను నేషనల్ కాంగ్రెసుతో చేతులు కలిపి ఫాసిస్టుతత్వానికీ సామ్రాజ్యతత్వానికీ కూడ వ్యతిరేకుల మని చాటేవారు. మిత్రమండలి స్వాధీనంలో వున్న దేశాలస్వాతంత్ర్యం ప్రకటింపబడితే మిత్రమండలి ఆశయాలను నిజమని నమ్ముతామని ఇండియన్ నేషనల్ కాంగ్రెసు చెప్పినట్లే చెప్పేవారు. జపాను వ్యతిరేక పోరాటానికి విమానాశ్రయాలనూ నౌకాశ్రయాలనూ యీయవలసిందని మిత్రమండలితో కలిసి సోవియటు రష్యాను ఒత్తిడి చేసేవారు. యూరపులో రెండవరంగం పెట్టవలసిందని బ్రిటనును ఇండియన్ కమ్యూనిస్టుపార్టీ వత్తిడిచేయడం ఎఱుగుదుము. ఇండియాక్షేమంకోసం సోవియటురష్యాను మిత్రమండలి కోర్కెలు నెరవేర్చి, జపానుపైన యుద్ధం ప్రకటించ వలసిందని ఎందుకు మన కమ్యూనిస్టులు వత్తిడిచేయరు? ఇది అర్థంచేసుకుంటే కమ్యూనిస్టులు ఈ యుద్ధంలో అవలంబిస్తున్న వైఖరిని పూర్తిగా అర్థం చేసుకున్నట్లే.

ఈ సందర్భంలో మరొక ముఖ్యవిషయం చెప్పవలసి ఉంది. ఈ మధ్య అ. భా. కమ్యూనిస్టుపక్షనాయకుడు పి. సి. జోషీకీ గాంధీకీ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఒకచోట, జోషీగారు,

“మమ్మల్ని మీరంతగా ఎరుగరు. నెహ్రూగారికి మమ్మల్ని గురించి ఇంకా ఎక్కువ తెలుసు......... మేము అప్పుడప్పుడూ నెహ్రూగారిని కలుసుకుంటుండే వాళ్లం, కాంగ్రెసులో చర్చకు వచ్చే జాతీయ, అంతర్జాతీయ సమస్యలనుగూర్చి మా అభిప్రాయాలను వారికి తెలుపుకుంటుండే వాళ్లం” అని గాంధీజీకి వ్రాశారు. కాబట్టి నెహ్రూగారు జైలునుండి వచ్చిన తరువాత వీరినిగూర్చి చెప్పిన మాటల నిక్కడ ఉదాహరించడం సముచితం.

“Fundamentally the Communist's policy is not from the stand point of the country where it functions but from the stand point of Russian foreign policy.

............from many points of view I do not think the nation's policy can be bound up with Russian foreign policy.

“.........whenever there is a conflict between international and national policies, the national policy wins. If that is true of Great countries, it is infinitely more so in the case of a dependent country like India.”

“......At a critical moment in India's history it was difficult to be neutral but they went to the other side.”

కమ్యూనిస్టుల నడక వారున్న దేశానికి అనుగుణంగా ఉండదు. సోవియటు విదేశ రాజనీతికి లయతప్పకుండా తాళం

వేస్తూండడమే ముఖ్యంగా వారవలంబిస్తూన్న పంథా. అనేక కారణాలను బట్టి, మన జాతీయవిధానాన్ని రష్యా విదేశ రాజనీతితో ముడిపెట్ట వీలవుతుందని నే ననుకోను.

జాతీయ, అంతర్జాతీయ విధానాలలో భిన్నదృక్పథాలు ఉన్నప్పుడు, జాతీయవిధానానిదే పైచేయి అవుతుంది. గొప్ప గొప్ప స్వతంత్ర దేశాల విషయంలోనే ఇలా జరుగుతూంటే, పరాధీన భారతదేశం విషయంలో ఈ సంగతి ఇంకా ఎక్కువ నిజం కావాలి.

............భారతదేశచరిత్రలో తటస్థించిన విషమ సమయంలో ఉపేక్షాభావంతో ఉండడమే చాలా కష్టం; అందులో వారు (కమ్యూనిస్టులు) ఎదిరిపక్షంలో కలిశారు."

కమ్యూనిస్టులు తమను గూర్చి బాగా తెలుసునని చెప్పిన జవహర్‌లాలు నెహ్రూ నుండి వారు పొందిన యోగ్యతా పత్రం ఇది. దీని తరువాత నెహ్రూనుగూర్చి జోషి అధికారులు వ్రాసిన పుస్తకంలో ఏమన్నారో చూడండి.

"గతమూడేళ్లుగా జరిగిన మార్పులను గూర్చి నెహ్రూ యింకా బాగా చదవాలి; అవగాహన చేసుకోవాలి;......... లేకపోతే యూరపుకు వెళ్లి పరిస్థితులు స్వయంగా చూచి రావడం మంచిది. మాస్కో ఏజెంట్లని చెప్పే సామ్రాజ్య వాదుల నిందలను వల్లించడం సరికాదు."ఎంత దురహంకారం! చదువుకొని అవగాహన చేసుకోకుండా సామ్రాజ్యవాదుల నిందలను వల్లిస్తూన్నారట; నెహ్రూ—నిజంచెపితే, బూర్జువా, పెట్టుబడిదారూ, ఫాసిస్టు, సామ్రాజ్యవాది, జపాను యేజెంటు పంచమాంగదళ సభ్యుడు, అభివృద్ధి నిరోధకుడు, సోవియటు

ప్రతికక్షీ, (Anti-Soviet) ఇదీ కమ్యూనిస్టులు ప్రయోగించే పరిభాష – ఇందుకు భయపడి చాలామంది పలకకుండా ఉంటారని వారి ఊహ– సోవియటు ప్రభుత్వం కూడా తమ సరిహద్దు దేశాలలో తమ కిష్టంలేని ప్రభుత్వం వచ్చినప్పుడు దాని పైన ఇటువంటి పరిభాషే ప్రయోగిస్తుంది. అన్ని దేశాలలోని కమ్యూనిస్టులూ సోవియట్టు నాయకుల సంగ్రహ ప్రతిబింబాలే కదా!

## ఐరోపా యుద్ధానంతరం

ఐరోపా యుద్ధానంతరం, బలవత్తరమైన సోవియట్టు రష్యా వత్తిడివల్ల సామ్రాజ్య ప్రభుత్వాలుకూడా తమకింద నున్న దేశాలను వదులుకోక తప్పదనీ, అప్పుడు ఇండియా వంటి పరాధీనదేశాలు తప్పకుండా స్వాతంత్ర్యమును పొంది తీరుతవనీ కమ్యూనిస్టులు ప్రచారం చేస్తూవచ్చారు. కాని ఇప్పు డేమి జరుగుతూన్నది. తక్కిన సామ్రాజ్యదేశాలమాట అలా ఉంచి ముఖ్యంగా సోవియట్టురష్యా అవలంబిస్తూన్న వైఖరిని విచారిద్దాం. సోవియట్ రష్యా అభివృద్ధి నిరోధకులలో అగ్రగణ్యుడైన ఫ్రెంచిసామ్రాజ్యవాది డీగాలీతో 20 సంవత్సరాలవరకూ అమలులో ఉండే పరస్పర సహకార సంధి చేసుకొన్నది. సిరియా, లెబనాన్ దేశాల స్వాతంత్ర్య ప్రకటనకు భిన్నంగా డీగాలీ అవలంబించిన నిర్బంధవిధానాన్ని వ్యతిరేకిస్తూ చర్చిలు ప్రభుత్వం తీసుకొన్నంత చర్యయైనా రష్యా తీసికోలేదు. హిట్లరు కాలిక్రింద నుండి బయటపడిన ప్రతిదేశంలోనూ, తన చెప్పుచేతలలో

ఉండే ప్రభుత్వాలను స్థాపించాలని సోవియట్ రష్యాకూడా ఇంగ్లాండు అమెరికాలతో పోటీపడుతూన్నది.

చైనాలో తమ పలుకుబడిని నిల్పుకొని, అక్కడి అంగళ్లతో వ్యాపారం ఎక్కువ చేసుకొనేటందుకు అమెరికా రష్యాలు పోటీపడుతూన్నవని వార్తలు వస్తూన్నవి. 1943 నవంబరులో జరిగిన రష్యా విప్లవ జయంతినాడే, కరేలియాన్ ఫిన్నిష్ రిపబ్లిక్కున్నూ ఎస్తోనియా, లాట్వియా, లిథుయేనియా, బెస్సరేబియాలున్నూ వైటురష్యా, ఉక్రేనియాలున్నూ తనకు కావలెనని స్టాలిన్ చెప్పినాడని ఇదివరకే వ్రాసి ఉన్నాము. ఇవిచాలక సోవియటు 'రక్షణరంగం' (Security Sphere) అనే పేరుతో తన సరిహద్దులలో నున్న తదితర దేశాల కీలక స్థానాలు కావలెనని సోవియటు రష్యా ప్రయత్నిస్తూన్నది. బల్గేరియా, ఇరాన్, టర్కీ, చైనా, మంగోలియా, మంచూరియా, కొరియాలలో కూడా ప్రధాన స్థానాలను కోరుతూన్నది.

## ఇ రా న్

ఒక వైపునుండి బ్రిటిష్ ఇండియన్ సైన్యాలు మఱొక వైపునుండి సోవియటు సైన్యాలున్నూ ఈదేశాన్ని 1941 ఆగస్టు చివరవారంలో ఆక్రమించినవి. అందువల్ల, రష్యాకూ, పర్షియన్‌గల్ఫుకూ, ట్రాన్సు ఇరానియన్ రైల్వే గుండా రహదారీ యేర్పడి అన్ని ఋతువులలోనూ రష్యాకు యుద్ధసామగ్రి పంపడానికి వీలయింది. అప్పుడిక యుద్ధం అంత మయిన ఆరునెలలకంటె ఎక్కువ తమ సైన్యాలను అక్కడ ఉంచము అని మిత్రమండలివారు ఇరాన్‌తో సంధి చేసు కున్నారు. ఇప్పుడు రష్యా అక్కడ, నూనెగనులు కావాలం

టుంది. ఇవ్వ నిరాకరించిన ఇరాన్ ప్రభుత్వాన్ని అభివృద్ధి నిరోధక ఫాసిస్టు ప్రభుత్వమని సోవియట్టు పత్రికలు ప్రచారం చేస్తూన్నవి. క్యాపిటలిస్టుప్రభుత్వ మయిన అమెరికా తన సైన్యాలను ఇరాన్‌నుండి పంపివేసింది. కాని సోవియటు సైన్యాలక్కడనుండి ఉపసంహరించడానికి స్టాలిన్ అంగీకరించ లేదు. మిత్రమండలి సైన్యాలు ఇరాన్‌ను వదిలిపెట్టేయెడల ఇరానులోని అభివృద్ధినిరోధకులు స్థాపిస్తూన్న బ్లాక్ సైనిక దళం, నియంతృత్వమును యేర్పాటు చేస్తుందని ప్రవడా అంటూన్నది. సోవియటు సైన్యాలు ఉత్తరాన ఉంటే దక్షిణాన నూనెగనుల రక్షణకోసరం బ్రిటిషు సైన్యాలు కూడా ఉండాలంటూన్నది బ్రిటిష్ ప్రభుత్వం. ఇరాన్‌కు ఉత్తరదిశను రష్యాను అంటుకొని ఉన్న Azer baijan అజరు బైజాన్ జిల్లా 1941 లో జరిగిన ఆంగ్లో రష్యన్ ఒడంబడిక ప్రకారం తాత్కాలికముగా రష్యా ఆక్రమణలో ఉంచబడినది. దానికి పడమర సరిహద్దులలో టర్కీ ఉన్నది. South-West (నైఋతి దిక్కున) ఇరాకుడుంది. ఇరానులో కల్లా పరాక్రమణ బాగా అభివృద్ధిపొంది భాగ్యవంతమైన ప్రదేశ మదే. అది రష్యాలో కలిస్తే రష్యాయొక్క పలుకుబడి ఇరాకు సరిహద్దులలోనుండి మోసూలు వరకూ వ్యాపించవచ్చును. మోసూలు ఉత్తర ఇరాకులో ప్రధాన నగరం. ఇరాకు నూనెగనుల కది మంచి కేంద్రస్థానం. మోసూలునుండియే ట్రాన్సుజోర్డానుగుండా బ్రిటిష్ నౌకాశ్రయమైన హైఫాకు, సిరియాగుండా ఫ్రెంచి మ్యాండేటుక్రింద ఉన్న బీరూటుకూ, నూనె ప్రవహిస్తూం టుంది. ఇటువంటి ముఖ్యప్రదేశంపైన రష్యా కన్ను వేసింది. అప్పటి నుండే సోవియట్ రష్యాకు కూడా సామ్రాజ్యభావాలు

కలిగిన వని లోకానికి వెల్లడి అవుతూన్నది.

ఇంతకు పూర్వం సోవియటు రష్యాను పదేపదే శ్లాఘిస్తూ వచ్చిన సోషలిస్టు లనేకు లిప్పు డెదురు తిరిగారు. ఇండియాలో మసానీ, ఆచార్యనరేంద్రదేవులు వారిలో ముఖ్యులు. మసానీ అభిప్రాయా లిదివరకే గ్రంథస్థం చేయబడి నవి, "ఇరానియన్ నూనెగనుల విషయంలో సోవియటు అవలంబించిన విధానం చాలా వ్యాకులం కలిగిస్తూన్నది. వలస దేశాలలో సోవియట్టు ప్రతిష్ఠ కందువలన చాలా, దెబ్బతగి లింది" అన్నాడు ఆచార్యనరేంద్రదేవు. ఇది ఆయన జైలు నుండి వచ్చిన తర్వాత బొంబాయిలో జులై 2వ తేదీన (1945) అసోసియేటెడ్ ప్రెస్సుకు చెప్పిన మాట. ఈపైన చెప్పిన సోవియటు రక్షణరంగ (Security Sphere) మును స్థాపించేటందుకు రష్యా అవలంబిస్తూన్న విధానాన్ని గూర్చి ఆయన ఇంకా ఇలా అన్నాడు. "ఇందుకోసం సామ్రాజ్య వాదుల దోపిడీవిధానంవలే కనిపించే పద్ధతులను అవలంబించ డానికి రష్యా వెనుదీయదు. అసలు ఉద్దేశాలేవైనప్పటికీ, ఈ కొత్త కార్యవిధానం వలన క్రమక్రమంగా, సోవియట్ అధి కారవర్గంవారి ప్రవర్తనలో ఒకమార్పు గలిగి, తుదకు పరి పాటి అయిపోతుంది. ఇదే చాలా అపాయం."

చైనా సోవియటురష్యాకు సరిహద్దులలో నున్న సింకి యాంగ్ రాష్ట్రం విషయంలో చైనాకూ రష్యాకూ తగాదా తప్పదని విండెల్ విల్కీ ఎప్పుడో తన గ్రంథంలో వ్రాశాడు. ఇప్పుడు చైనాలోని యేనాను కమ్యూనిస్టులు చుంకింగ్ ప్రభుత్వంతో పేచీలు పెట్టుకోవడం రష్యా ప్రోత్సాహం

లేకుండా జరగడంలేదు. ఒకవంక జపానుతో ఎనిమిదేళ్ల నుండి పోరాడుతూన్న చైనా ప్రభుత్వం కమ్యూనిస్టుల మూలాన ఆంతరంగికకల్లోలాలకు, గురికావడం దురదృష్టం—

"ఇండియా విషయములో చైనాజపాను యుద్ధంలో కమ్యూనిస్టులు మొన్న మొన్నటిదాకా చుంకింగు ప్రభుత్వంతో కలిసిపోరాడాలేదా?" అని ప్రశ్నించవచ్చును. జర్మనీ రష్యాలు యుద్ధంలో చిక్కుకొని ఉన్నప్పుడు తూర్పు నుండి జపాను రష్యామీద పడకుండా ఉండడానికి చైనా కమ్యూనిస్టులు చుంకింగి సైన్యాలతో కలిసి జపాను వ్యతిరేక రంగాన్ని బలపరిచారు. తీరా పడమర జర్మనీ నుండి రష్యాకు భయం తగ్గిపోయిన తరువాత తూర్పునుండి జపాను రష్యాపై దూకజాలదని తెలుసుకొని జంగ్ కై షేకు సైన్యాలతోనే చైనీసు కమ్యూనిస్టు సైన్యాలు పోరాడుతూన్నవి. పైపెచ్చు జపానుతో పోరాడుతూన్న చైనా కేంద్ర ప్రభుత్వసైన్యాలకు అమెరికానుండి సాధనసామగ్రి సప్లయి చేస్తూన్నందుకు చైనాలోని అమెరికన్ రాయబారికి దురుద్దేశాలాపాదిస్తూన్నారు. చైనా కమ్యూనిస్టు నాయకులు చైనా కమ్యూనిస్టులకూ, తమకూ రాజీచేయవలసిందని అడగడానికి చైనా విదేశాంగమంత్రి డాక్టరు సూంగ్ మాస్కోకు పరుగెత్తవలసి వచ్చింది.

ఈ వత్తిడి సమయంలో సోవియట్టు ప్రభుత్వం చైనాను ఎన్నిహిరణ్యాక్ష వరాలైనా కోరవచ్చును. చైనా ఐక్యతను భంగం చేయడానికి సోవియట్టు యేజెంట్లుగా పనిచేస్తూన్న చైనా కమ్యూనిస్టులే, "చైనా ఐక్యసంఘటన" అని కేకలు

వేస్తూండడం మన మెఱుగుదుము. ఈ సందర్భంలో వీరితో మన ఇండియన్ కమ్యూనిస్టులకు ఎంతో పోలిక ఉంది. ముస్లింలీగు జెండాకింద ఇండియా ఐక్యతను భంగఅచే పాకిస్థాన్ నినాదాన్ని బలపరుస్తూ, 'కాంగ్రెస్ – ముస్లింలీగు' రాజీపడాలి' అని కేకలు పెడుతూంటారు మన కమ్యూనిస్టులు.

ఇండియా చైనాలవంటి పెద్దదేశాలలోని ఐక్యత విచ్ఛిన్నం కావించి వాటిని చిన్నచిన్న రాజ్యాలుగా చేసే కమ్యూనిస్టుల చర్యలు ఫలిస్తే, యూరపులోని చిన్నచిన్న దేశాలలో వలెనే ఆసియాఖండంలో కూడా సోవియట్టురష్యా పలుకుబడి నిరాటంకంగా సాగిపోవడానికి వీలవుతుంది.

సోవియట్టు రష్యావలని చైనా ఐక్యతకు భంగం కలుగ వచ్చునని భావిస్తూ, "కనీసం చైనాను మఱొక పోలాండుగా చేయకుండా అగ్రనాయకత్రయం ప్రయత్నింతురు గాక!" అని మాంచెస్టరు గార్డియన్ 1945 జులై 24 వ తేదీని వ్రాసింది.

## టర్కీ

డార్డినెల్సు జలసంధిలోని కొన్ని ముఖ్యస్థానాలున్నూ టర్కీలోని కార్సు అర్డ్విన్, అర్డహాన్ ప్రదేశాలున్నూ సోవియట్ రష్యా కావలె నంటుంది. అంతేకాక ఆర్డినెల్సు గుండా సోవియట్టురష్యా టర్కీదేశాల యుద్ధనావలు మాత్రమే పోయే హక్కును అంగీకరించవలె నని టర్కీని రష్యా నిర్బంధిస్తూన్నట్లు వార్తలు వస్తూన్నవి.

డార్డినెల్సుగుండా నౌకాయానములు సక్రమంగా జరిగేటందుకు 1936 జులై 20 వ తేదీని బల్గేరియా, ఫ్రాన్సు,

గ్రేటుబ్రిటన్, గ్రీసు, జపాన్, రుమేనియా, టర్కీ, సోవియట్టు యూనియన్, యుగోస్లావియాల మధ్య మాంట్రూలో (Montreu) సమాఖ్య జరిగినది. అది 1956 వరకూ అమలులో ఉంటుంది.

కాని ఇప్పుడు రష్యా, టర్కీ దేశాల యుద్ధనౌకలు తప్ప తక్కిన దేశాల యుద్ధనౌకలు డార్డినెల్సుగుండా ప్రయాణం చేయకూడ దనే షరతుకు అంగీకరిస్తూ ఆ రెండు దేశాలూ సంధిపత్రం వ్రాసుకొంటే మాంట్రూసమాఖ్యయొక్క స్వరూపమే మారిపోతుంది. అందువల్ల టర్కీ తక్కినదేశాల సమ్మతిలేకుండా ఈ షరతు అంగీకరించ వీలులే దంటూన్నది. రష్యా ప్రపంచయాజమాన్యం కోసం చేస్తూన్న ప్రయత్నాలలో ఇది ఒకటి.

ఇదంతా ఇలా ఉండగా టాంజియార్, జిబ్రాల్టరు, సూయజ్, పెనామాలవంటి ప్రపంచ ప్రాముఖ్యస్థానాల విషయంలో సోవియట్టు రష్యావైఖరి ఎలా ఉంటుందో ముందు ముందు చూడాలి.

## శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశం

యునైటెడ్ నేషన్సు కాన్ఫరెన్సు అనే పేరుతో మిత్ర దేశాలు 50 కలసి శాన్‌ఫ్రాన్సిస్కోలో సమావేశమైనవి. ప్రపంచ శాంతిస్థాపన కోసం సమావేశమైన దని చెప్పబడే ఈ సభలో యుద్ధంలో దిగక శాంతి వహించి తటస్థంగా ఉన్న ఐర్లెండు, స్వీడన్, స్విట్జర్లండు, స్పెయిన్ లాంటిదేశాలకు స్థానం లేకుండా చేయబడినది. ఈ సమావేశానికి బ్రిటన్, అమెరికా,

రష్యా, చైనా ఫ్రాన్సు దేశాలు అగ్రరాజ్యాలుగా నాయకత్వం వహించినవి. వీరి యాజమాన్యం క్రింద జరిగిన ఈ సభవారు తయారు చేసిన సమాఖ్యను బట్టి రాబోయే నూతన ప్రపంచం ఎలా ఉంటుందో, వలసరాజ్యాలలోని పీడిత ప్రజానీకమునకు ఈయుద్ధం వలన లభించిన స్వాతంత్ర్య మెట్టిదో తెలియగలదు.

శాన్ఫ్రాన్సిస్కో సభవారు వ్రాసిన సమాఖ్యలోని ముఖ్యవిషయా లివి :—

ఇప్పటికి సంయుక్తరాజ్యాల సమితి (United nations Assembly) లో యాభై మంది సభ్యులు మాత్రమే ఉన్నారు. ఈ సమితివారి ఆశయాలను అంగీకరించేవారు కూడా ఇంకా సభ్యులుగా చేరవచ్చును. అయితే వారిని చేర్చుకోవడానికి ఇప్పుడున్న సమితిసభ్యులలో 2/3 వంతు అంగీకరించాలి. సంయుక్తరాజ్యాలసభ్యు లందరూ ఉండే ఈ సమితికి జనరల్ అసెంబ్లీ అని పేరు. ఈ జనరల్ అసెంబ్లీలోనుండి ఒక సెక్యూరిటీ కౌన్సిలు ఏర్పాటు చేయబడింది. ఆ సెక్యూరిటీ కౌన్సిలులో అగ్రరాజ్యా లని వ్యవహరింపబడుతూన్న, చైనా, ఫ్రాన్సు, సోవియట్టు రష్యా, గ్రేటుబ్రిటను, అమెరికాసంయుక్త రాష్ట్రాలు అయిదూ శాశ్వతసభ్యత్వం కలిగి ఉంటవి. మరి ఆరుదేశాలను జనరల్ ఎసెంబ్లీ, సంయుక్తరాజ్యాలనుండి ఎన్ను కొంటుంది, ఈ ఆరుదేశాలూ రెండు సంవత్సరాల కాలమే సెక్యూరిటీ కౌన్సిలులో ఉంటవి. తరువాత కొత్త ఎన్నికలు జరుగవలసిందే. మొత్తం సెక్యూరిటీకౌన్సిలులో 11 మంది సభ్యులు :—

## జనరల్ అసెంబ్లీకి అధికారాలు

జనరల్ అసెంబ్లీకి చాలా విషయాలలో చర్చించడానికీ, ఆలోచించడానికీ, విమర్శించడానికీ, పరిశీలించడానికీ, సెక్యూరిటీ కౌన్సిలు దృష్టికి తీసుకొని రావడానికీ, సిఫారసు చేయడానికీ మాత్రమే అధికారాలు ఉన్నవి. వాటిని సెక్యూరిటీకౌన్సిలు అంగీకరించి తీరాలనే నిర్బంధం లేదు. అసెంబ్లీసభ్యులలో 2/3 వంతు అంగీకరిస్తేనేగాని, ఏ ముఖ్యవిషయంలోనూ వారు నిర్ణయానికి రావీలులేదు.

సెక్యూరిటీకౌన్సిలు చేసిన నిర్ణయాలను జనరల్ అసెంబ్లీ సభ్యు లంతా అంగీకరించి అమలుపఱచి తీరాలి. కాబట్టి జనరల్ అసెంబ్లీకి సెక్యూరిటీకౌన్సిలు బాధ్యత వహించ నక్కరలేదు. సెక్యూరిటీకౌన్సిలుకు జనరల్ అసెంబ్లీయే బాధ్యత వహిస్తూన్నది.

## దురాక్రమణదారులపై చర్య

దురాక్రమణదారులపైన చర్యతీసికోవలసివచ్చినప్పుడు సెక్యూరిటీకౌన్సిలులో శాశ్వతసభ్యులైన (Big powers) బ్రహ్మాండనాయకు లైదుగురిలో ఏ ఒక్కరు వ్యతిరేకమైన ప్పటికీ యేమీ చర్య జరపడానికి వీలులేదు. అనగా ఈపెద్ద నాయకులలో యే ఒకరుగానీ, లేక వీరిలో యే ఒకరికైనా యిష్టమైన వారుగానీ దురాక్రమణ జరిగించేయెడల ఈ ప్రపంచవ్యవస్థ యేమీ చర్యతీసుకో దని హామీ యిస్తూన్నా రన్నమాట. కాబట్టి ఈ పెద్ద రాజ్యాలవారు సంయుక్త

రాజ్యాల సమితిని, తమఅధికారం ప్రపంచంలో చిరస్థాయిగా చేసుకోవడానికి వినియోగించు కోవచ్చును.

శాన్ ఫ్రాన్సిస్కో సభలో, రష్యా ప్రతినిధుల వైఖరి పాతసామ్రాజ్యవాదుల వైఖరిని కూడా మించిపోయింది. దురాక్రమణకు వ్యతిరేకంగా చర్య తీసికొనే విషయంలో మాత్రమే పెద్ద రాజ్యాలకు 'వీటో' అధికారం ఉండవలెనని ఇంగ్లాండు, అమెరికా లంటే, అలాకాదు (Procedural matters) కార్యవిధానం విషయంలోనే 'వీటో' అధికారం ఉండవలె నని రష్యా పట్టుపట్టింది. కార్యవిధానం విషయ మనగా దురాక్రమణను గూర్చి విచారణచేసే విధానంలోనే అని అర్థం.

మాస్కో అంగీకరించిన పోలాండు ప్రభుత్వాన్ని పూర్తిగా బ్రిటను అంగీకరించక, పోలాండు నాయకులను తనకు తెలియకుండానే నిర్బంధించినందుకు బ్రిటను గును స్తూన్న సమయంలో ఇండియా స్వాతంత్ర్యం విషయం ఎత్తు కొని మాలటావ్ బ్రిటనును బెదిరించాడు. పోలాండు విష యంలో తమ మాట నెగ్గించుకోవడానికి ఇండియా స్వాతంత్ర్య నినాదాన్ని సాకుగా వినియోగించుకోగలిగాడు, మాలటావ్.

## ట్రస్టీల కమిటీ

"ట్రస్టుదేశాల రాజకీయవాంఛలను గమనించి ఆ యా దేశాలప్రత్యేకపరిస్థితులనూ అభివృద్ధినీబట్టి అక్కడిస్వతంత్ర రాజకీయసంస్థలను క్రమక్రమంగా పెంపొందిస్తూ స్వపరి పాలనమును ప్రోత్సహించడం, సంయుక్తరాజ్యాల ఆశయం"

అనే నియమానికి సోవియట్‌రష్యాకూడా అంగీకరించి ట్రస్టీషిప్పుకౌన్సిలులో సభ్యత్వం సంపాదించుకొన్నది. ఈ నియమం ఆకును అందకుండా పోకను పొందకుండా, బ్రిటిష్ సామ్రాజ్యం ఇండియాను గూర్చి నిరంతరమూ చేస్తూన్న వాగ్దానాలకు ఏ మాత్రమూ తీసిపోవడంలేదు. ట్రస్టురాజ్యాల అభివృద్ధినీ, అర్హతను నిర్ణయించే వారెవరు? ట్రస్టీలుగా-ఉన్న వారేనా? అయితే ఇండియా అర్హతను బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించినట్లే ఉంటుంది.

కనుకనే ఈ శాన్ ఫ్రాన్సిస్కో చర్చలతోనూ, నిర్ణయాల తోనూ అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ అసంతృప్తి పడి ఇటీవల సిమ్లాలో ఒక తీర్మానం చేసినది. దానిలోని ముఖ్య భాగ మీ క్రింద ఉదాహరిస్తూన్నాను.

.........ఈ సమాఖ్యలో చిన్న దేశాల కీయబడిన స్థానము నిష్ప్రయోజనముగా నున్నందుకున్నూ, అగ్రరాజ్యాల వారీసంస్థను లోబఱచుకొని పూర్తిగా యాజమాన్యం వహించ డమే గాక వారి సహాయంతో తయారైన చట్టంకంటెకూడా వారే పైవారుగా వ్యవహరించే స్థితిలో ఉంచబడినందుకున్నూ ఈ కమిటీవారు విచార పడుతున్నారు. ఈ అగ్రరాజ్య ప్రభు త్వాలవారు నిజంగా తమ అధికారమును ప్రపంచకంలో బలపరచుకొని కేంద్రీకరించుకొన్నారు. పరాధీనజాతులకు వ్యతిరేకంగా వారనుభవిస్తూన్న ప్రత్యేకాధికార సౌకర్యా లను గానీ, వలసరాజ్యాలనుగానీ వదలుకోవలె ననే కోరిక యెంతమాత్రమూ వారి కున్నట్లు కనిపించదు. ఈ సమాఖ్యను బట్టి చూస్తే పెద్దరాజ్యాలవారిలో యే ఒకరికీ కూడా తగా

దాలో జోక్యం లేనప్పుడు మాత్రమే ఈ ప్రపంచ వ్యవస్థ ప్రయోజనకరంగా ఉంటుంది. సాధారణంగా చాలా అంతర్జాతీయ వివాదాలలో పెద్ద రాజ్యాలకు సంబంధముండడానికి సావకాశ మున్నది. అటువంటి సమయంలో యే పెద్ద రాజ్యం వ్యతిరేకించినా యేమిరా చర్య నడపడానికి వీలు లేదు.

"ముఖ్యంగా అస్వతంత్ర దేశాలను గూర్చి చేయబడిన ప్రకటన సందిగ్ధంగానూ, అసంతృప్తిగానూ ఉన్నందుకు ఈ కమిటీవారు విచారపడుతూన్నారు... ... ... ... ...

"ట్రస్టీషిప్పు విషయంలో జరిగిన శాన్‌ఫ్రాన్సిస్కో చర్చయున్నూ, స్వతంత్ర మనే పదమునకు కొన్ని ప్రభుత్వాలు ప్రయత్నపూర్వకంగా చేసిన ఆక్షేపణలున్నూ, సామ్రాజ్య ప్రభుత్వాలింకా పాతపడిన సామ్రాజ్యవిధానాన్నే అనుసరిస్తూ తమ వలసరాజ్యాలను దోచుకొని తినేటందుకు కాపాడుకోవలె నని ఉద్దేశిస్తూన్న వనడానికి నిదర్శనాలు."

ఈ తీర్మానంపైన, శాన్‌ఫ్రాన్సిస్కో చర్చలను గూర్చి గానీ, వాటి ఫలితములను గూర్చి కానీ ఇంకా వ్యాఖ్యానం చేయడం అనవసరం.

వర్కింగుకమిటీ చేసిన ఈ తీర్మానాన్ని ఇంతవరకూ ఈ యుద్ధంలో జరిగిన ఘటనలనూ, మిత్రరాజ్యాల వారి ప్రకటనలనూ, శాన్‌ఫ్రాన్సిస్కో చర్చలనూ, నిర్ణయాలనూ, ఐరోపాయుద్ధానంతరం హిట్లరు నిరంకుశత్వము నుండి విడుదలైన రాజ్యాలలోని ప్రభుత్వ నిర్మాణములను గూర్చి మిత్ర మండలివారిలో కలిగిన కలతలనూ, ఒకరి దేశంలోని ప్రధాన భాగాలను (Strategic positions) మరొకరు మింగవలె నని

మిత్రమండలి వారిలోనే కొందఱు తమతో తాము పడు తూన్న పాట్లనూ గమనించిన తరువాత కూడా ఈ యుద్ధం "ప్రజాయుద్ధమ"ని వాదించే వారిని అలా కాదని ఒప్పించడం దుస్సాధ్యం.

ఇంతా వ్రాసిన తరువాత, సోవియట్టు రష్యా జర్మనీ పైన చేసిన యుద్ధం తన సంరక్షణ కోసమే అయినప్పుడు కాంగ్రెసు సోవియట్ రష్యాయెడల సానుభూతి చూపుతూ యెందుకు తీర్మానాలు చేసిం దని ప్రశ్నించవచ్చును. కాంగ్రెసు మొదటినుండీ దురాక్రమణను ఖండిస్తూ ఆక్రమిత దేశాలకు సానుభూతి చూపుతూనే ఉన్నది. చైనా, అబిసీనియా, పోలాండు మొదలగు దేశాలు దురాక్రమణకు గుఱియైనప్పుడు కాంగ్రెసు ఆ దేశాల యెడల సానుభూతి చూపించింది. జర్మనీ దురాక్రమణకు గుఱియైన సోవియట్టు రష్యాపైనకూడా ఆలాగే కాంగ్రెసు తనసానుభూతిని ప్రకటించింది. స్వసంరక్షణ చేసుకొనే దేశాల యెడల కాంగ్రెసుకు యెప్పుడూ సాను భూతి ఉంటుంది. ఏ పేరుతోనూ పరాయిదేశాలను ఆక్ర మించడం, అణచి ఉంచడం కాంగ్రెసుకు గిట్టదు. ఆసంగతి శాన్ ఫ్రాన్సిస్కో సభపైన కాంగ్రెసు వర్కింగుకమిటీ చేసిన తీర్మానంవలన స్పష్టమవుతూనేఉంది. కాంగ్రెసు విమర్శించిన అగ్రరాజ్యాలలో సోవియట్టు రష్యాఉంది. సోవియటు రష్యా అవలంబిస్తూన్న విదేశ రాజనీతివలన కాంగ్రెసు వైఖరిలో గలిగిన మార్పు తీర్మానం స్పష్టంగా తెలియచేస్తూన్నది.

ఈ యుద్ధంవచ్చిన తరువాత అంతర్జాతీయ వ్యవహా రాలను బాగా పరికిస్తూన్న వా రందరూ సోవియటురష్యా

కొ త్తరకపు సామ్రాజ్యతత్వాన్ని అవలంబిస్తూన్న దని గ్రహిస్తున్నారు. లూయీ ఫిషరుకు పూర్వము అభిప్రాయం ఎలా పరివర్తనం చెందినదో ఆయన వ్రాసిన "స్టాలిన్ అండ్ హిట్లరు" చదివితే తెలుస్తుంది. సోవియట్టు విధానాన్ని ఇదివరకు శ్లాఘిస్తూ వచ్చిన, సర్. యస్. రాధాకృష్ణ, ఇంగ్లాండు ఎన్నికలలో కార్మికవిజయాన్ని అభినందిస్తూ

"కార్మిక ప్రభుత్వం, వలససామ్రాజ్య తత్వాన్ని (Colonial imperialism) బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి, అమెరికా, లేక రష్యా సామ్రాజ్యత్వా లన్నింటినీ తృణీకరించి ప్రజల యిష్టప్రకారం వ్యవహరించుకొనే స్వాతంత్ర్యం యిస్తుందని నాకు చాలా ఆశగా ఉంది" అన్నారు. తక్కిన సామ్రాజ్యాలతోపాటు రష్యానుకూడా ఆయన చేర్చడం ముఖ్యంగా గమనించ తగ్గది.

సోవియట్ రష్యా అంతర్జాతీయతనుండి జాతీయతలోకి దిగడమేగాక, ఈ యుద్ధఫలితంగా 'సోషలిస్టు మార్కు' దుందుడుకు మహాసామ్రాజ్యాన్ని నిర్మింపబోతూన్న దన డానికి ఇప్పటికే తగినన్ని ఆధారాలు కనబడుతూన్న వన్నాడు, గాంధియన్ ప్లాను వ్రాసిన ఆ చార్య అగర్వాల్.

ఇంతవరకు వ్రాసిన గ్రంథంలో సోవియట్టు రష్యా విదేశ రాజనీతియే యెక్కువగా విమర్శింపబడినది. సోవియట్టు యూనియన్ యుద్ధంలో పాల్గొన్న నాటినుండీ ఇది ప్రజా యుద్ధ మయిన దని వాదించే కమ్యూనిస్టుల వైఖరి సరియైనది కాదని ఋజువు చేయడమే దాని ముఖ్యోద్దేశం. అంతేకాని

మరొకటి కాదు. తక్కిన సామ్రాజ్యవాదుల భావాలను గూర్చి వివాదమే లేదు గనుక వారి విషయ మెక్కువగా వ్రాయ లేదు.

కాంగ్రెసు ప్రధానంగా భారతదేశస్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న సంస్థ. కాని ప్రపంచంలోని తదితర దేశాల పీడితప్రజానీకంతో కాంగ్రెసుకు సంపూర్ణసానుభూతి ఉన్నది. భారతస్వాతంత్ర్యం ప్రపంచకాభ్యుదయానికి అనుగుణంగా ఉండవలెను. గాని అందులకు విభిన్నంగా ఉండరా దని కాంగ్రెసు ఆశయము. అంతర్జాతీయ వ్యవహారాలను గూర్చి కాంగ్రెసు చేసిన ప్రతితీర్మానంలోనూ ఈ దృక్పథం ప్రతి బింబిస్తూన్నది. పాతసామ్రాజ్యాలను నిలుపుకోవడానికీ, కొత్త సామ్రాజ్యాలను సంపాదించడానికీ చేసే యుద్ధాలలో కాంగ్రెసు జోక్యం కలిగించుకోవడం లేదని అనేకసార్లు తీర్మానించింది. 1927 లో, జరిగిన మద్రాసు కాంగ్రెసు మహాసభ చైనా ప్రజల స్వాతంత్ర్య సమరానికి, సంపూర్ణసానుభూతి చూపిస్తూ వారికి తన అభినందనాలను అందచేసింది. బ్రిటిష్ ప్రభుత్వం వారు తమ సామ్రాజ్యవిధానమును కొనసాగించుకొనే ఉద్దే శంతో భారతీయసేనలను చైనాకు పంపినందుకు తన వైమన స్యమును ప్రకటిస్తూ వాటిని తిరిగి రప్పించవలసిం దని ఆదేశిం చింది; సామ్రాజ్యవ్యతిరేకపోరాడంలో భారతీయప్రజకు చైనాప్రజలు సహచరులుగా భావిస్తూన్నా మని ప్రకటించింది; చైనాకు కాంగ్రెసు పంపించదలచుకొన్న వైద్యబృందానికి ప్యాసుపోర్టు లీయనందుకు ఇండియా ప్రభుత్వచర్యను నిర సించింది. అదే మహాసభ రాబోయే యుద్ధాపాయమును గూర్చి కాంగ్రెసు వైఖరినీ స్పష్టంగా తెలియచేస్తూ మరొక

తీర్మానం చేసింది. అందులో బ్రిటిష్ ప్రభుత్వంవారు సామ్రాజ్య సంగ్రామసన్నాహాలకు దిగి భారతదేశాన్ని ఇంకా ఉపయోగించుకో ప్రయత్నించే యెడల, అటువంటి యుద్ధంలో జోక్యం కలిగించుకొనుట, నిరాకరించడం హిందూదేశ ప్రజల విధి అని ఉద్ఘోషించింది; భారతప్రజానీకము తమ ఇరుగుపొరుగు దేశాల వారితో శాంతంగా కాలక్షేపం చేయవలెనని వాంఛిస్తూన్నది. కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వంవారు, ముఖ్యంగా ఇండియా వాయవ్యసరిహద్దులలో చేస్తూన్న ఆ నాటి బ్రహ్మాండమైన యుద్ధప్రయత్నాలను విరమించుకోవలసిన దని కూడా ఆ తీర్మానం కోరుతూన్నది.

1928 డిశంబరులో కలకత్తాలో, జరిగిన కాంగ్రెసు సైతము మద్రాసు తీర్మానమును తిరిగీ జ్ఞాపకంచేస్తూ మరొక తీర్మానం చేసింది.

1936 ఏప్రిల్‌లో జరిగిన లక్నో కాంగ్రెసు నాటికి ఫాసిస్టు నియంతృత్వాలు పెచ్చుపెరిగి పోతూ ఉండడమూ, అబిసీనియా పైన ఇటలీ దండయాత్ర చేయడమూ, ఉత్తర చైనాపైనా, మంగోలియా పైనా జపాను విజృంభణ కొనసాగుతూండడమూ, సామ్రాజ్యవాదప్రభుత్వాలు తమలో తాము పోటీపడి యుద్ధపరికరాలను ఎక్కువగా తయారు చేసుకొంటూండడమూ చూచి, భయంకరమహాసంగ్రామ మొకటి ప్రపంచకానికి దాపరించనున్నట్లు ఆ మహాసభ గ్రహించింది. కనుకనే అది రానున్న యుద్ధంలో బ్రిటిష్ సామ్రాజ్యప్రయోజనాల కోసం భారతదేశాన్ని కొల్లగొట్టడానికి ప్రయత్నాలు జరిగితీరుతవి కాబట్టి, ఈ అపాయాన్ని భారతప్రజలు

గ్రహించి సామ్రాజ్యయుద్ధంలో సంబంధం కలిగించుకోకూడ దని 1927 నాటి మద్రాసు కాంగ్రెసు తీర్మానాన్ని జ్ఞాపకం చేస్తూ వేరొక తీర్మానం చేసింది.

తరువాత 1937 డిశంబరులోని ఫైజుపూరు కాంగ్రెసు నాటికి యుద్ధ మింకా దగ్గరలోకి వచ్చిన కారణంచేత, బ్రిటిష్ సామ్రాజ్య రక్షణకోసము హిందూదేశ ద్రవ్యము, గానీ ప్రజలు కానీ ఉపయోగపడ కూడ దని హెచ్చరిస్తూ తీర్మానించబడినది.

1938 హరిపురాకాంగ్రెసు యుద్ధంపైనా, విదేశరాజ నీతిపైనా ఈ దిగువ విధంగా తీర్మానించింది.

భారత ప్రజలు తమ ఇరుగు పొరుగు దేశాలవారితోనేగాక తదితరదేశాలవారందరితో కూడా మిత్రభావంతో శాంతంగా జీవించకోరు తూన్నారు. ఇందుకుగాను, వారికి గల వివాదకారణాల నన్నింటిని తొలగించవలె నని వాంఛిస్తూన్నారు. తమ జాతీయ స్వాతంత్ర్యప్రయత్నములతో పాటు పరుల స్వాతంత్ర్యమును గూడా మన్నిస్తూ అంతర్జాతీయ సహకారసుహృద్భావములపైన బలపడవలె ననియే వారి ఆశయము. కాని అటువంటి సహకారము ప్రపంచవ్యవస్థ ద్వారా జరుగవలెను. స్వతంత్ర భారతదేశం అటువంటి వ్యవస్థలో సంతోషంగా పాల్గొని, ఆయుధవిసర్జనమునకూ, సమిష్టి సంరక్షణకూ అండగా నిలబడ గలదు. అయితే అంతర్జాతీయ వివాద కారణాలు విచ్ఛిన్నంకాక, ఒకజాతిపైన మఱొకజాతి అధికారం చలాయిస్తూ సామ్రాజ్యతత్వం విజృంభిస్తూన్నంత కాలమూ ప్రపంచసహకారం మాట సాధ్యంకాని పని.

కాబట్టి చిరస్థాయి యైన ప్రపంచశాంతిని చేకూర్చవలెనంటే, ఒకజాతి మఱొకజాతిని కొల్లగొట్టడమూ, సామ్రాజ్యతత్వమూ రూపుమాయాలి.

కడచిన కొన్నిసంవత్సరాలనుండి అంతర్జాతీయ వ్యవహారాలు అతివేగంగా క్షీణదశకు వస్తూండడం చాలా విషాదకరం. ఫాసిస్టు దురాక్రమణ పెచ్చుపెరిగి పోతూన్నది. అంతర్జాతీయ సంధులను సిగ్గులేకుండా తృణీకరించడమే ఫాసిస్టు ప్రభుత్వాలకు రాజనీతిగా పరిణమించింది. ఒకనిర్ణయంలేక తప్పుకుతిరగవలె నని ప్రయత్నాలు చేస్తూన్నప్పటికీ, బ్రిటిష్ ప్రభుత్వం జర్మనీ, స్పెయిను దూర ప్రాచ్య దేశాలలో ఫాసిస్టు ప్రభుత్వాలనే నియమంగా ప్రోత్సహిస్తూండడంచేత, ప్రపంచక పరిస్థితు లంతకంతకు పాడవడానికి చాలావరకు వారి విదేశ రాజనీతియే కారణ మని చెప్పాలి. ఇప్పటికీ అది నాజీ జర్మనీతో చేతులు కలిపేటందుకే ప్రయత్నాలు చేస్తూ స్పెయిన్ తిరుగుబాటుదారులతో సన్నిహితసంబంధాలను పెట్టుకొని ప్రపంచ సామ్రాజ్య యుద్ధానికి దారితీస్తూన్నది.

భారతదేశ మట్టు వంటి సామ్రాజ్యయుద్ధంలో పాల్గొని తన అర్థబలాన్నీ, అంగబలాన్నీ బ్రిటిష్ సామ్రాజ్య రక్షణ కోసం వినియోగించడానికి అంగీకరించదు. అంతేకాదు భారత ప్రజలు బహిరంగంగా ఒప్పుకొంటేనేగాని ఇండియా యే యుద్ధంలోనూ పాల్గొనడానికి వీలులేదు. కాబట్టి హిందూదేశంలో చేసే యుద్ధ ప్రయత్నాలన్నింటికీ కాంగ్రెసు పూర్తిగా తన అసమ్మతిని తెలుపుతూన్నది.........................
తరువాత 1939 మార్చిలో త్రిపురికాంగ్రెసు జరిగినది.

మ్యూనిచ్ సంధికీ, ఆంగ్లో ఇటాలియన్ ఒడంబడికకూ, స్పెయిన్ తిరుగుబాటుదారుల ప్రభుత్వ అంగీకారమునకూ దారితీసిన బ్రిటిష్ విదేశ రాజనీతి, ప్రపంచంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ సమిష్టి సంరక్షణ సిద్ధాంతాన్నీ భగ్నంచేసిన దని ఆ మహాసభ తీర్మానించింది. ఫాసిస్టు ప్రభుత్వాలకు సహాయం చేయడమే పనిగా పెట్టుకొన్న బ్రిటిష్ రాజనీతితో తమ కేమీ సంబంధం లే దని స్పష్టపటిచింది; సామ్రాజ్య వాదమూ, ఫాసిస్టువిధానమూ నశిస్తేనే గాని ప్రపంచ శాంతిభద్రతలకు వీలులేదు. గనుక కాంగ్రెసు ఆ రెండు తత్వాలకూ కూడా వ్యతిరేక మని విశద పటిచింది; భారత దేశ మొక స్వతంత్రజాతిగా ప్రత్యేక విదేశ రాజనీతిని నిర్ణయించు కోవలసిన తరుణ మాసన్నమైనట్లు తన అభిప్రాయాన్ని వెల్లడించింది. 1939 మార్చిలో జరిగిన త్రిపురీ కాంగ్రెసు జాతీయవాంఛా (National demand) తీర్మానాన్ని చేసింది. అందులో స్వతంత్ర, ప్రజాపాలిత భారతదేశం వెంటనే తన సమశ్యలను చక్కగా పరిష్కరించికో గలగడమే గాక ప్రపంచకాభ్యుదయమునకు తోడ్పడే ప్రజలతో కలసి ప్రజాపాలనా స్వాతంత్ర్యములకు సహాయపడగలదు" అని కాంగ్రెసు వైఖరి విశదీకరించబడినది.

1927 నుండి 1939 మార్చి వరకూ చేయబడిన ఈపై తీర్మానాలన్నీ కాంగ్రెసు ఫాసిస్టు తత్వానికీ, సామ్రాజ్య తత్వానికీ కూడా విరోధమేననీ, ప్రజాపాలనా స్వాతంత్ర్యములను బలపటిచే ప్రపంచవ్యవస్థతో స్వతంత్రభారతదేశం సహకారంచేయడానికి సంసిద్ధంగా ఉండగలదనీ విశదం చేస్తూన్నవి.

బ్రిటిష్ సామ్రాజ్యతత్వానికి దోహదం చేసే యుద్ధాలలో జోక్యం కలిగించుకోక పోవడ మలా ఉండగా, భారత ప్రజల స్పష్టమైన అంగీకారం లేనిదే ఇండియా యే యుద్ధంలోనూ పాల్గొన జాలదని కూడా వాటిలో విస్పష్టంగా వ్రాయబడింది. అయినప్పటికీ 1939 మార్చిలో ఇండియన్ సైన్యాలు కొన్ని ఏడెన్‌కు పంపబడడమూ, రానున్న యుద్ధావసరముల కనుగుణంగా, బ్రిటిషు సామ్రాజ్యతత్వానికి ప్రతినిధిగా పని చేస్తున్న ఇండియా ప్రభుత్వమునకు నియంతృత్వాధికారాలను సమర్పిస్తూ ఇండియా చట్టాన్ని మార్చడానికి ప్రయత్నాలు జరగడమూ గమనించి, ఈ రెంటికీ తమ అనంగీకారమును తెలియజేస్తూ 1939 ఏప్రియల్‌లో అ. భా. కాం సం. తీర్మానించింది.

1939 ఆగస్టులో యుద్ధ ప్రయత్నాలను గూర్చి కాంగ్రెసు కార్యవర్గం చేసిన తీర్మానంలో ఈ విధంగా ఉంది.

"......... ఈ ప్రపంచ సందిగ్ధావస్థలో స్వేచ్ఛా స్వాతంత్ర్యముల కండదండగా నిలచిన ప్రజల యందే ఈ కార్యవర్గసభ్యులకు సంపూర్ణ సానుభూతి ఉన్నది. యూరపు, ఆఫ్రికా, ఆసియా, దూరప్రాచ్యదేశాలలోని ఫాసిస్టు దురాక్రమణలనూ, జెకోస్లోవాకియా, స్పెయిన్ దేశాలలో ప్రజాపాలనములకు ద్రోహంచేసిన బ్రిటిష్ సామ్రాజ్య విధానమును కాంగ్రెసు పదే పదే ఖండించింది. యుద్ధాన్ని గూర్చి కాంగ్రెసు తన వైఖరిని యిదివరకే స్పష్టపరిచింది. భారతదేశం పైకి బలవంతంగా యుద్ధాన్ని తెచ్చిపెట్టే అన్ని ప్రయత్నాలనూ ఎదిరించేటందుకు కాంగ్రెసు నిశ్చయించు కొన్నది. ...

ప్రజాపాలనాస్వాతంత్ర్యముకోసం బ్రిటిష్ ప్రభుత్వం నిలబడదనీ, ఈ ఆదర్శాల కది ఎప్పుడైనా ద్రోహమే చేస్తుందనీ దాని పూర్వచరిత్రనుబట్టీ, ప్రస్తుత పరిస్థితులనుబట్టీ బాగా ఋజువవుతూన్నది. కాబట్టి అటువంటి ప్రభుత్వం తో భారత దేశం సంబంధం పెట్టుకోజాలదు. తనకు నిరాకరింపబడిన ప్రజాపాలనాస్వాతంత్ర్యం కోసం, తన సాధనసామగ్రిని ఈయవలసిం దని భారతదేశాన్ని ఎవ్వరూ కోరకూడదు.

" 1939 మే ఒకటో తేదీని కలకత్తాలో అ. భా. కాం. సం. ఈ వైఖరినే బలపరచి, విదేశాలకు భారతీయ సైన్యాలను పంపినందుకు తన అసమ్మతిని వ్యక్తపరిచింది. అయినప్పటికీ బ్రిటిష్ ప్రభుత్వం వారు, భారత ప్రజల కోరికకు వ్యతిరేకంగా ఈజిప్టుకూ, సింగపూరుకూ భారత సైనికులను పంపించారు. ఇంకా పంపిస్తున్నారు కూడా. యుద్ధ పరిస్థితులకు ముందే కొంతకాలం కిందట శాసనసభ అంగీకారం లేకుండా, భారత సైన్యాలను విదేశాలకు పంపవద్దని కేంద్ర శాసన సభ తీర్మానించింది. బ్రిటిష్ప్రభుత్వంవారు కాంగ్రెసు యొక్కయూ కేంద్రశాసనసభ యొక్కయూ తీర్మానములను తృణీకరించి, భారతదేశం తప్పకుండా యుద్ధంలో చిక్కుకొనే యేర్పాట్లన్నీ చేశారు.....................

కాంగ్రెసు కార్యవర్గం, బ్రిటిష్ ప్రభుత్వంవారి ఈ నిర్ణయాలను అంగీకరించ జాలదు. కాంగ్రెసు వైఖరికి అనుగుణంగా ఉండే అన్ని చర్యలనూ వర్కింగు కమిటీ తీసుకో దలచుకొన్నది. ఇందుకుగాను మొట్టమొదటగా కేంద్రశాసన

సభలోని కాంగ్రెసు సభ్యులను రాబోయే శాసనసభాసమా వేశమునకు హాజరుకాకూడదని ఆదేశిస్తూన్నది.

"కాంగ్రెసు నిర్ణయించిన ఈవిధానమును బాగా మనస్సులోపెట్టుకొని రాష్ట్రీయ ప్రభుత్వాలు బ్రిటిష్‌గవర్నమెంటు వారి యుద్ధ ప్రయత్నాల కేవిధంగానూ తోడ్పడరాదని ఈ కమిటీవారు జ్ఞాపకం చేస్తూన్నారు. ఈ వైఖరి వలన కాంగ్రెసు మంత్రులు రాజీనామా ఈయవలసి వచ్చినా బర్తరఫుకావలసి వచ్చినా అందుకు కూడా వారు సంసిద్ధంగా ఉండాలి...... ..."

ఇండియా శాసనసభాతీర్మానాలకు వ్యతిరేకంగా, బ్రిటిష్ ప్రభుత్వం తన సామ్రాజ్యరక్షణకోసం భారత సైన్యాలను విదేశాలకు ఎగుమతి చేస్తూన్నదనే అభిప్రాయం తోనే ఈ పై నిర్ణయం చేయబడినది.

ఈ తీర్మానం 1939 ఆగస్టు 9, 12 తేదీలలో జరిగినది. 1939 సెప్టెంబరు ఒకటో తేదీని హిట్లరు, పోలాండుపైన దండయాత్ర చేశాడు. సెప్టెంబరు మూడో తేదీన ఇంగ్లాండు జర్మనీపైన యుద్ధం ప్రకటించింది. వెంటనే రాజప్రతినిధి లిన్‌లిత్‌గో ప్రభువు ఇండియాకూడా జర్మనీతో యుద్ధం చేస్తూన్నదని ప్రకటన చేశాడు. అందులో

"ఈ యుద్ధంలో ప్రవేశించడంలో రాజగారి ప్రభుత్వాని కేవిధమైన స్వార్థమూ లేదు. మానవ లోకానికి సంబంధించిన ప్రధాన సిద్ధాంతాలను రక్షించే టందుకూ, ప్రపంచసభ్యత క్రమాభివృద్ధి పొందేటట్లు చూడడానికి, జాతులమధ్య కలిగే వివాదాలను, పశు

బల ప్రయోగము వలననాక, శాంతియుతము, న్యాయ సమ్మతమూ అయిన పద్ధతులతో పరిష్కరించడం కోసమూ మాత్రమే బ్రిటిష్ ప్రభుత్వమువారు రింగులో ప్రవేశించారు.

“ఈ తరుణంలో భారతదేశం దాస్యమునకు వ్యతిరేకంగా మానవ స్వాతంత్ర్యపక్షాన నిలబడి ప్రపంచకంలోని చారిత్రకసభ్యత గల గొప్పదేశాలలో అగ్రస్థానం పొంది వ్యవహరించగల దని నా విశ్వాసం అన్నాడు లిన్‌లిత్ గో ప్రభువు.

సెప్టెంబరు 5 వ తేదీని వైస్రాయి పిలువగా గాంధీజీ ఆయనను దర్శించారు. రానున్న మహాసంగ్రామఫలితాలాయన హృదయాన్ని చీకాకు పరచినవి. కాని ఆయన భారతప్రజల పక్షాన బ్రిటిష్‌ప్రభుత్వానికి సహకారం వాగ్దానం చేయలేక ఇలా బహిరంగప్రకటన చేశాడు. “నేను పూర్తిగా అహింసావాదిని. నా అహింస అణచివేస్తే అణిగి పోయేది కాదు. కాబట్టి నేను నా ప్రజలచిత్తవృత్తిని సరిగా ప్రతిబింబింప చేయజాలను, ఒకవేళ నే నా ప్రయత్నం చేసినప్పటికీ పూర్తిగా అపజయం పొందేమాట నిజం. ఈ సంగతి నేను రాజప్రతినిధికి చెప్పినాను. కాబట్టి నాతో రాజప్రతినిధి రాయబారాలు నడిపి రాజీకి రావలసిన అవసరం లేదు. ఆయన అందుకోసం నాకు కబురు పంపినట్లు నాకు తోచనూలేదు. ఏదైనా రాయబారాలు కానీ రాజీకానీ జరిగేపక్షంలో ప్రభుత్వానికీ కాంగ్రెసుకూ జరగాలి.”

ఈ ప్రకటన తరువాత కాంగ్రెసు వర్కింగు కమిటీవారు వార్ధాలో సెప్టెంబరు 7 మొదలు 14 వరకూ సమావేశమై చివరి రోజున ఒక పెద్ద ప్రకటన చేశారు. ఆ ప్రకటనలోని ఈ క్రింది ముఖ్యవిషయాలను గమనించే యెడల యుద్ధము నెడల కాంగ్రెసు అవలంబించిన వైఖరి స్పష్టంగా తెలియగలదు.

“ఒక మంచివిషయంలో సహకారం కావలసిన యెడల బలవంతంగా నెత్తిని రుద్దినంత మాత్రంతో లభించదు. ప్రజలకు వెలిదైన అధికారవర్గం వారు పంపే ఉత్తరువులను భారత ప్రజలు అనుసరించవలెనని ఈకమిటీవా రంగీకరించజాలరు. సమానులైనవా రుభయులూ పరస్పరం మంచిదని అంగీకరించిన విషయంలో మాత్రమే సహకారం సాధ్యపడుతుంది... ............ కాని ప్రజాపాలనాస్వాతంత్ర్యముకోసమని చెప్పబడుతూన్న ఈ యుద్ధంలో, తన కటువంటి స్వాతంత్ర్యము నిరాకరింపబడడమే గాక, ఇదివరకున్న కొంచెము స్వేచ్ఛ కూడా లాగివేయబడినప్పుడు భారతదేశము జోక్యం కలిగించుకో జాలదు...............

ఈ యుద్ధం మామూలుగా సామ్రాజ్యములనూ, వలస రాజ్యములనూ, స్వప్రయోజనములనూ, ప్రత్యేకాధికారాలనూ, రక్షించుకోడానికే అయితే ఇండియాకు దీనితో యేమీ జోక్యంలేదు. అలాకాక, ప్రజాపాలనమూ ప్రజాపాలనముపైన ఆధారపడిన ప్రపంచవ్యవస్థ, ఈ యుద్ధమునకు ప్రధాన విషయమయినట్లయితే ఇండియాకు దీనితో అత్యంత సన్నిహిత సంబంధం ఉన్నది......

ఇతర స్వతంత్ర దేశములతో పాటు ప్రజాపాలిత స్వతంత్ర భారతదేశం దురాక్రమణకు వ్యతిరేకంగా పరస్పరసంరక్షణ కోసమూ, ఆర్థిక సహకారం కోసమూ కలసి మెలసి పనిచేయు డానికి సంతోషంగా అంగీకరిస్తుంది ... ...

"కాబట్టి ప్రజాపాలన, సామ్రాజ్యతత్వ నూతనవ్యవస్థల విషయములో బ్రిటిషు ప్రభుత్వమువారి యుద్ధాదర్శములను గూర్చి; ముఖ్యంగా ఆ ఆదర్శాలు ఇండియాకు ఎలా వర్తింప చేసేదీ, ప్రస్తుతం వాటిని యే విధంగా ఆచరణలో పెట్టేదీ తెలియచేస్తూ స్పష్టంగా ఒక ప్రకటనను చేయవలె నని కోరు తున్నాము. ఆ ఆదర్శాలలో సామ్రాజ్యతత్వాన్ని వదులు కొని ప్రజల యిష్టానుసారం పరిపాలించుకొనే పద్ధతిని భారత దేశాన్ని స్వతంత్రంగా చేసే సంగతి యిమిడి ఉన్నదా? ఫాసిస్టు తత్వాన్నీ, సామ్రాజ్య విధానాన్ని నిర్మూలించే టందుకు వాగ్దానం చేస్తూ ప్రభుత్వం స్పష్టంగా ప్రకటిస్తే అన్ని దేశాల ప్రజలూ ఆనందిస్తారు. అయితే ఆ ప్రకటన కనుగుణంగా సాధ్యమైనంత ఎక్కువ ఆచరణలోకి వస్తేనే ప్రజలకు దాని యందు విశ్వాసం కలుగుతుంది. కాబట్టి అది ఎక్కువ ముఖ్యం. ప్రతి ప్రకటనకూ ప్రస్తుతాచరణమే నిజమైన ఒరిపిడిరాయి. ప్రస్తుతం ఆ ప్రకటనను ఆచరణలోకి తెచ్చే విధానమునుబట్టియే యే వర్తమానమూ, భవిష్యత్తూకూడా ఆధారపడి వుంటవి.

యూరపులో యుద్ధం ప్రాసిగింది. ఆ దృశ్యం ఊహించ డానికే చాలా భయంకరంగా ఉన్నది. అయితే ఇటీవల అబి సీనియా, చైనా, స్పెయిను దేశాలలో కూడా యుద్ధం చాలా జననాశనం చేస్తూన్నది. బహిరంగనగరాలలో నిరపరాధు

లైన స్త్రీలూ, పురుషులూ ఎంతమందో విమానదాడులకు గురి అవుతూన్నారు. తెరకొచ్చిండి నిర్బంధ ప్రవాసాలకు తోయడం, క్రూరంగా హింసించడం, నీచంగా అవమానించడం - ఇవన్నీ ఒకటి తరువాత ఒకటి వెంట వెంటనే ఘోర కలిగా జరిగి పోతూన్నవి. అంతకంతకే భీతావహం పెచ్చు పెరిగి ప్రపంచకం దౌర్జన్యమేఘావృత మవుతూన్నది. దీనిని వెంటనే నిరోధించి నిర్మూలించకపోతే పూర్వార్జిత సంస్కృతి నశించిపోతుంది. యూరోపు, చైనా దేశాలలో ఆ భయంకర సంఘటనలను నిరోధించవలసిందే కాని అందుకు ఆధారభూతములైన ఫాసిస్టు సామ్రాజ్య విధానములు నశిస్తేనే గాని అవి అంతం కావు. ఆ ఆదర్శం కొఱకు వర్కింగుకమిటీవారు సహాయం చేయడానికి సంసిద్ధంగా ఉన్నారు."

ఈ ప్రకటనలో ఇంత విస్పష్టంగా కాంగ్రెసు తనవైఖరిని చెప్పినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వమువారు తమ యుద్ధాదర్శములను గూర్చి చెప్పవలసినావశ్యకత ఏర్పడ్డది. ప్రపంచకంలో ప్రజాపాలనా స్వాతంత్ర్యములను రక్షించడానికే కంకణం కట్టుకొని యుద్ధం చేస్తూన్నామని చెప్పే బ్రిటిష్ ప్రభుత్వం, తమ స్వాధీనంలో ఉన్న ఇండియా స్వాతంత్ర్యమును గూర్చి ఏమి ప్రకటన చేస్తుందా అని లోకం ఎదురు చూస్తూన్నది. ప్రభువుల సభలో జెట్లండు ప్రభువు 1939 సెప్టెంబరు 26 తేదీని ఒక ప్రకటన చేశాడు. అందులో కాంగ్రెసు నాయకులు తమ జాతీయవాంఛలను తిరిగి ప్రకటించడానికి ఇది సరియైన తరుణము కాదన్నాడు. అందుకు జవహరలాలు నెహ్రూ సెప్టెంబరు 29 తేదీని ప్రకటనచేస్తూ తాము వర్కింగుకమిటీ

ప్రకటనలో కోరిన ఆదర్శాలు బ్రిటను యుద్ధాశయాలలో లేనట్లయితే ఇండియా ఎందుకోసం పోరాడాలి? అని ప్రశ్నించాడు. తరువాత అక్టోబరు 18 వ తేదీని (18-10-1939) రాజ ప్రతినిధి ఇండియా ఎడల బ్రిటను ఎలా ప్రవర్తించబోతూన్నదో తెలియచేస్తూ కాంగ్రెసు అడిగిన యుద్ధాదర్శాలను గూర్చి ఈ విధంగా అన్నాడు.

"యుద్ధాదర్శాలను గూర్చి ఖచితంగా ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వమే యింతవరకూ ఇదమిత్థమని నిర్ణయించలేదు. కొంతకాలం జరిగిన తరువాత యుద్ధం మధ్యలో వాటి వివరణ రావడం సహజం. ఒకవేళ అటువంటి వివరణ వచ్చినప్పటికీ అది మిత్రమండలిలో యే ఒకరి ఆశయంగానూ ఉండదు. ఈలోగా ప్రపంచకంలో అనేక మార్పులు కలుగవచ్చును. యుద్ధం పరిసమాప్తి అయ్యేలోగా మనల నెదుర్కొన్న పరిస్థితులలో కూడా అనేక పరిణామాలు రావచ్చును. యుద్ధం నడుస్తూన్నప్పుడు జరిగే సంఘటనలను బట్టి అంతమయ్యేనాటి స్థితిగతులను బట్టీ చాలావరకు ఆధారపడి ఉంటుంది."

ఇది ఎంత ఆశను అందకుండా పోకను పొందకుండా ఉన్నదో చదువరులే గ్రహించగలరు. పిదప అక్టోబరు 22, 23 తేదీలలో కాంగ్రెసువర్కింగు కమిటీ సమావేశమై వైస్రాయి ప్రకటన సామ్రాజ్యవాదులు పాడే పాత పాటేనన్నది. కాబట్టి కాంగ్రెసు మంత్రులను రాజీనామా పెట్టవలసిందని కోరింది. మంత్రులు రాజీనామా యిచ్చారు. తరువాత కూడా ప్రభుత్వపక్షాన మనోజ్ఞ ప్రకటనలు, వ్యక్తిసత్యాగ్రహం, క్రిప్సు రాయ

బారం, అది అపజయం పొందిన విధానమూ అందఱికీ తెలిసి నవే. అవన్నీ యిక్కడ వివరంగా వ్రాయడానికి ఈచిన్ని కర పత్రంలో చోటూ చాలదు, అవసరమూ లేదు.

కాంగ్రెసు వర్కింగుకమిటీ 1939 సెప్టెంబరు 14వ తేదీని చేసిన ప్రకటనను బట్టీ, దానికి బదులుగా వైస్రాయి 1939 అక్టోబరు 8 వ తేదీని చేసిన ఉపన్యాస సారాంశమును బట్టీ, యుద్ధము నెడల కాంగ్రెసు వైఖరి, ఇండియా స్వాతంత్ర్యము నెడల బ్రిటిష్ ప్రభుత్వవైఖరీ పూర్తిగా తెలిసిపోతూన్నది. వైస్రాయి చేసిన ప్రకటన తరువాత కూడా గాంధీ 1939 అక్టోబరు 30 వ తేదీని ఇలా అన్నాడు.

"తమచర్యవల్లనే బ్రిటిష్ ప్రభుత్వంవారు, కాంగ్రెసుకు యుద్ధంలో సహకారంచేయ వీలులేని పరిస్థితులు కల్పించినప్పటికీ కాంగ్రెసుమాత్రం యుద్ధ కార్యక్రమ విషయంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని చీకాకుపఱచకూడదు."

కాంగ్రెసు దృక్పథం మొదటినుండి చివర వరకూ ఈలాగే ఉన్నది. మంత్రుల రాజీనామా కాని, వ్యక్తి సత్యాగ్రహంకాని ఇండియా స్వాతంత్ర్య సమస్య విషయంలో ప్రపంచ దృష్టిని ఆకర్షించడాని కుద్దేశింప బడినవేకాని మరొక ఉద్దేశం లేదు.

చిట్టచివరకు విసిగి వేసారి 1942 ఆగస్టు 8 వ తేదీని అ. భా. కాం. సం. చేసిన తీర్మానంలోకూడా, నాజీ ఫాసిస్టు, సామ్రాజ్య తత్వాల నిర్మూలనంకోసం పోరాడడానికి కాంగ్రెసు ఎంత తహతహ పడుతూన్నదో ఆ తీర్మానంలోని ఈ క్రింది ముఖ్యభాగాలవలన తెలియగలదు.

"రష్యా చైనా రంగాలలోని పరిస్థితులు క్షీణదశకు వస్తూన్నందుకు ఈ కమిటీవారు వ్యాకులపడుతున్నారు. తమ స్వాతంత్ర్య రక్షణకోసం మా రెండు దేశాలవారూ చూపిస్తూన్న ధైర్యసాహసాలను శ్లాఘిస్తూన్నారు.

నానాటికి పెచ్చుపెరిగి పోతూన్న ఈ అపాయం, స్వాతంత్ర్యంకోసం ప్రయత్నిస్తూన్న వారినీ, దురాక్రమణకు గురియైన దేశాలతో సానుభూతి కలవారినీ, మిత్రరాజ్యాలవలంబిస్తూన్న రాజనీతిని పరిశీలించ ప్రోత్సహిస్తూన్నది. అదే అనేకసార్లు వినాశహేతుభూతమైన అపజయానికి దారితీసింది. దానిని అంటిపెట్టుకొని ఉండడంవలన విజయంరాదు. ఆ రాజనీతిలోనే ఓటమి యిమిడి ఉన్నది. అది స్వాతంత్ర్యంపైన కాక, వలసరాజ్యాలనూ పరాయిదేశాలనూ లోబఱచుకొని సామ్రాజ్య సంప్రదాయ విధానములను కొనసాగించడం మీాద ఆధారపడి ఉంది. సామ్రాజ్యం పాలకులకు బలం చేకూర్చడంలేదు. పైపెచ్చు భారంగా పరిణమిస్తూన్నది. ఆధునిక సామ్రాజ్యతత్వానికి మూలకందమైన భారతదేశం ఇప్పుడు ప్రధాన సమస్య యైనది. భారత స్వాతంత్ర్యమును బట్టి బ్రిటను యొక్కయూ తదితర మిత్రదేశాలయొక్కయు, సదుద్దేశములను అర్థంచేసుకొని ఆశియా ఆఫ్రికా ఖండ ప్రజలు ఉత్సాహంతో ఆశాపూరితులు కాగలరు. అందువలన ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వం అంతం కావడం తక్షణం జరుగవలసిన ప్రధానసమస్య. దీనిపైననే ప్రజాపాలనా స్వాతంత్ర్యముల విజయమున్నూ యుద్ధభవిష్యత్తున్నూ ఆధారపడి ఉన్నవి. స్వతంత్ర భారతదేశం తన సాధన సామగ్రిని సర్వసమర్పణం

చేసి నాజీ, ఫాసిస్టు, సామ్రాజ్యవాద దండయాత్రల నెదుర్కొని స్వాతంత్ర్య సమరానికి తోడ్పడగలదు. ఇది యుద్ధవిజయానికి చాలావరకు సహాయ మవడమే గాక, ప్రపంచకంలోని, పీడిత ప్రజానీకమును, బానిస ప్రజలను, మిత్రదేశాల వశానికి తెచ్చి భారతదేశంతో కూడిన మిత్రదేశాలవారి ఆధ్యాత్మిక నైతిక ప్రపంచ నాయకత్వమును అంగీకరించేటట్టు కూడా చేయ గలదు. బానిస భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్య తత్వానికి చిహ్నం. ఈ సామ్రాజ్యతత్వకళంకం మిత్రమండలివారి భవిష్యత్తుకు నష్టం కలుగచేస్తుంది.

కనుక ఈ ఆపత్తు తొలగవలెనంటే బ్రిటిష్ అధికారం పోయి ఇండియా స్వాతంత్ర్యం పొందాలి. ముందెప్పుడో ఏదో చేస్తామనే వాగ్దానాలు గానీ గ్యారంటీలు గానీ యేమీ లాభం లేదు. అవి ప్రజాసామాన్యముయొక్క మానసిక ప్రవృత్తిలో తగినంత మార్పు కావించ జాలవు. స్వాతంత్ర్యజ్యోతి ఒక్కటే కోట్లకొలదీ ప్రజల ఉత్సాహ శక్తులను విజృంభింపచేసి యుద్ధస్వభావమును వెంటనే మార్చివేయగలదు.

....................................................

భారత స్వాతంత్ర్యం ఆశియాఖండంలోని తదితర పరాధీన జాతుల స్వాతంత్ర్యమునకు చిహ్నమై నాందీవాక్యము కాగ లదు. బర్మా, మలయా, డచ్చి ఈస్టిండీస్, ఇరాణ్, ఇరాకు దేశాలన్నీ కూడా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందాలి. నేడు జపాను క్రింద ఉన్న దేశాలు, ఇక యే వలసరాజ్యాధికారం క్రిందకూ పోకూడదు.

... ....... ....... ...

స్వతంత్ర భారతదేశం సంతోషంగా ప్రపంచ సమాఖ్యలోచేరి, తక్కిన దేశాలతో సమాన ప్రతిపత్తి గలిగి అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించడానికి తోడ్పడగలదు.

... ...... ...... ...

"వర్కింగు కమిటీవారి హృదయ పూర్వకమైన ప్రార్థనకు గ్రేటుబ్రిటను కానీ, సంయుక్తదేశాలుగానీ యింతవరకేమీ ప్రత్యుత్తర మీయలేదు. విదేశాలలో చేయబడిన కొన్ని విమర్శనలను చూస్తే భారతదేశముయొక్కయూ ప్రపంచకము యొక్కయూ అవసరములను వారు గ్రహించినట్లు కనిపించదు. ఒకొక్కప్పుడా విమర్శలు భారత స్వాతంత్ర్యానికి విరోధంగాకూడా ఉంటూ జాతీయ దురహంకారమునూ, అధికార చిత్తవృత్తినీ సూచిస్తూన్నవి. తమ ఉద్యమంలో న్యాయం ఉందనే నమ్మకం గలిగి, తమ శక్తిసామర్థ్యాలను గుర్తెఱిగి ఉన్న ఆత్మగౌరవంగల ప్రజలు ఈ వైఖరిని యెంతమాత్రమూ సహించజాలరు."

తరువాత ఈ తీర్మానంలోని చివర భాగంలో భారతదేశం తన స్వాతంత్ర్యమును సంపాదించేటందుకు గాంధీ నాయకత్వంక్రింద అహింసాయుత పోరాటం సాగించవలెనని ప్రజలను హెచ్చరించింది.

ఈ తీర్మానంలో, నాజీ, ఫాసిస్టు, సామ్రాజ్య తత్వాలను నిర్మూలంచేసి, ప్రపంచశాంతిని చేకూర్చి, ప్రపంచ సమాఖ్యలో తదితర దేశాలతోపాటు అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించేటందుకు భారతదేశం స్వాతంత్ర్యమును పొందవలెనని ఉన్నది. తమ స్వాతంత్ర్యమేకాక ఆశియాలోని

తక్కిన పరాధీన దేశాలుకూడా స్వాతంత్ర్యం పొందవలె నని ఉంది. ఇది బ్రిటిష్ ప్రభుత్వమువారి కెలా కంటకమైనదో తెలియడు. ఇందువలన జపానును ఆహ్వానించడ మవుతుందని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాంగ్రెసు నాయకులను నిర్బంధించిన తరువాత జరిగిన సంగతులు లోకవిదితమే. కమ్యూనిస్టులు కూడా సామ్రాజ్య వాదులతో చేతులుకలిపి ఈ తీర్మానం ఇండియా రక్షణకు భంగం కలిగిస్తుందన్నారు. కాని ఇటీవల జరిగిన సంఘటనలను బట్టీ, ప్రకటనలనుబట్టీ సామ్రాజ్యవాదులైనా తమవాదాన్ని ఉపసంహరించుకొన్నారు గానీ, కమ్యూనిస్టులు మాత్రం యింకా అదే పాట పాడుతూన్నారు. "కాంగ్రెసు కమ్యూనిస్టులు" అని కామ్రేడ్ పి. సి. జోషీవ్రాసిన కరపత్రంలో కూడా ఈ మాట ఉంది. అది వట్టి నిరాధారమైనమాట. ప్రీవీ కౌన్సిలరుగా పనిచేసిన రైటానరబిల్ జయకరు ఈ తీర్మానం నిరపాయకరమైన దని అభిప్రాయ మిచ్చారు.

యుద్ధమునుగూర్చి 1927 నుండి 1942 వరకూ చేయబడిన అన్నితీర్మానాలలోనూ కూడా, భారత దేశ స్వాతంత్ర్య; అంతర్జాతీయ శాంతిభద్రతలకు తోడ్పడే టందుకే నని స్పష్టీకరించబడినది. కాంగ్రెసు ఎన్నడూ యుద్ధవిషయంలో సంకుచిత జాతీయ భావంతో వ్యవహరించలేదు. ప్రజాపాలనా స్వాతంత్ర్యములకోసం పోరాడుతూన్నామని చెప్పే మిత్రదేశాలవారు భారత స్వాతంత్ర్య విషయంలో శ్రద్ధ తీసుకోకపోవడంవలన ప్రపంచ పరాధీన దేశాలలోని పీడిత ప్రజానీకమునకు తమయందు విశ్వాసం లేకుండా చేసుకున్నారు. ప్రపం

చకంలోని ఐదోవంతు జనసంఖ్యగల భారతదేశం స్వతంత్రమై యుండి హృదయ పూర్వకంగా యుద్ధంలో జోక్యంకలిగించు కొని ఉండినట్లయితే ఇప్పటికంటే ఎంతో తొందరగా యుద్ధం పరిసమాప్తి అయి యుండేది. ఇంతకాలం యుద్ధం కొనసాగి నందువలన ప్రపంచకానికి కలిగిన కష్టనష్టాలకు బాధ్యులు కావలసినవారు భారతదేశస్వాతంత్ర్యమును ఆటంకపఱిచిన వారేకాని కాంగ్రెసువంటి ప్రజాహిత సంస్థకాదు.

## కాంగ్రెసు దూరదృష్టి

ఈ యుద్ధ ఫలితంగా పరాధీన ప్రజకు స్వాతంత్ర్యం రాలేదు. పాత సామ్రాజ్యాలు చెక్కు చెదరలేదు. పసిఫిక్కు మహాసముద్రంలోని విమాననౌకాశ్రయాలన్నీ ప్రపంచ శాంతిని కాపాడడానికి అమెరికా తన అధికారంలో ఉండవలె నంటూన్నది. అధమం మిత్రమండలివారు యుద్ధం ప్రకటించిన మొదటి ఆశయం - పోలాండు సరిహద్దుల రక్షణ అయినా జరుగలేదు. పైపెచ్చు, జర్మనీ రష్యాల మధ్య విభజించుకో బడిన పోలాండు తిరిగి తలయెత్తడానికి వీలులేదు గనుక ఇంత టితో మిత్రమండలి (ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలు) యుద్ధం చాలించడం సమంజస మని 1939 అక్టోబరు 31 వ తేదీని ప్రకటించిన సోవియటు రష్యా యిష్టప్రకారమే పోలాండు సరి హద్దులు నిర్ణయింపబడడానికి బ్రిటిష్ ప్రభుత్వం దాదాపు అంగీకరించింది. స్వసంరక్షణ రంగం, (Security sphere) అనే పేరుతో మిత్రులూ, శత్రులూ అనే భేదంలేకుండా సోవియట్టు యూనియన్ కొత్తరకపు ఆక్రమణకు దిగుతూన్నది.

శాన్‌ఫ్రాన్సిస్కోలో తయారైన సంయుక్త రాజ్యాల సమాఖ్య, (United Nations Charter) నోచుగల పెద్ద రాజ్యాలు తదితరదేశాలకు స్వాధీనంలో ఉంచుకోవడానికి ఎలా తోడ్పడుతూన్నదో కూడా, పెద్దరాజ్యాల కున్న ప్రత్యేకాధికారాలను బట్టే తెలుస్తూన్నది.

కాబట్టి ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్నామనే మిత్రమండలివారు ఇండియావంటి పరాధీన దేశాల స్వాతంత్ర్యమును ప్రకటించి, అందు కనుగుణంగా ప్రవర్తించేవరకూ, తమదేశం యుద్ధంలో బుద్ధిపూర్వంకగా పాల్గొన జాలదని కాంగ్రెసు పదేపదే చేసిన తీర్మానాలలో ఎంత దూరదృష్టి ఉన్నదో యోజించండి.

'ప్రజాయుద్ధ' నినాదంలోని అర్థం చరిత్ర బాగా వెల్లడి చేసింది.






# తాజాకలం.



ఈ గ్రంథం అచ్చులో ఉండగా ప్రపంచక చరిత్రలో కొన్ని ముఖ్య సంఘటనలు జరిగినవి. అందువలన సోవియట్ రాజనీతిలో - ముఖ్యంగా చైనా యెడల సోవియట్ అవలంబిస్తూన్న రాజనీతిలో - కొంత మార్పు కలిగింది. ఆ మార్పు ననుసరించి చైనా కమ్యూనిస్టులు చైనా కేంద్ర ప్రభుత్వము నెడల అవలంబిస్తూన్న వైఖరికూడా మారిపోయింది. ఆ పరిస్థితులను వివరంగా తెలియచేయకపోతే, గ్రంథకర్త అభిప్రాయం ప్రస్ఫుటం కా దని ఈ తాజా కలం (Post Script) వ్రాస్తున్నాను.

సోవియట్‌రష్యా 1941 ఏప్రిల్‌లో జపానుతో తటస్థ సంధిని చేసుకొన్నది. ఆ సంధికి భంగం వచ్చే పని యేదిచేసినా జపాను రెండోవైపు నుండి తనమీద ఎక్కడ పడుతుందో అనే భయం వలన, జర్మనీ బలవత్తరంగా ఉన్నంత కాలమూ సోవియట్ యూనియను, మిత్రమండలితో కలసి జపాను యుద్ధంలో యేమీ అంటించుకోకుండా కాలక్షేపం చేస్తూ వచ్చింది. జపానుకుకూడా సోవియట్ యూనియనుకు కోపం తెప్పించడం యిష్టంలేదు. ఒకవైపున బ్రిటను, అమెరికాల వంటి ప్రబల శత్రువులతో పోరాడుతూన్నప్పుడు సోవియట్ రష్యాతో విరోధం పెట్టుకొంటే మధ్యలో నలిగిపోతా నని జపానుకు భయం. కాని జర్మనీబలం క్షీణించిన దని దృఢంగా తెలుసుకొన్న తరువాత 1945 ఏప్రిల్ నెలలో స్టాలిన్ "జపాను

రష్యాల మధ్య సంధికి ఇక అర్థంలేదు. అది కొనసాగడానికి వీలు లేదన్నాడు.” అంతే కాని జపాను పైన యుద్ధం ప్రకటించలేదు. కాని సరిగా జపాను ఓడిపోయే సమయంలో జపానుపైన యుద్ధం ప్రకటించి పసిఫిక్కు రంగంలో కూడా తన పలుకుబడి విజృంభింపచేసుకోవలెననే కోరిక రష్యాకు లేకపోలేదు. ఆ సంగతి తరువాత జరిగిన సంఘటనలను తేదీల వారీగా చూపితే పాఠకులు బాగా గ్రహించగలరు.

హిరోషిమా నగరం పైన మొట్టమొదటి
ప్రళయంబాంబు (Atom Bomb) పడ్డ తేదీ 6-8-45

నాగసాకీ నగరంపైన రెండో
ప్రళయంబాంబు పడిన తేదీ 8-8-45

సోవియట్ విదేశాంగ మంత్రి
యుద్ధం ప్రకటించిన తేదీ 8-8-45

సోవియట్ యూనియను యుద్ధంలో దిగిన తేదీ 9-8-45

జపాను చక్రవర్తి అధికారాలకు భంగం లేని షరతుతో మిత్రమండలికి లోబడడానికి జపాను అంగీకరించినట్లు టోకియో రేడియో ప్రకటన 10-8-45

జపాను మిత్రమండలికి లొంగిపోయి నందున తూర్పు యుద్ధం ముగిసిన తేదీ 14-8-45

ఈ తేదీలను బట్టి చూస్తే సోవియట్టు యూనియను జపానుతో యుద్ధంలోకి దిగేటందుకు ఎటువంటి అదనుకోసం వేచి ఉన్నదో తెలుస్తుంది. పాపం జపాను మిత్రమండలికి

తనకూ రాజీ చేయడానికి సోవియట్టు యూనియనును మధ్య-
వర్తిగా ఉండమని అప్పటికి కొన్ని వారాల క్రిందట కోరిందట.
సోవియట్టు నాయకుల మనస్సులోని మర్మం జపాను తెలుసుకో
లేకపోయింది కాబోలు?

అయితే ఈ ప్రళయబాంబు రహస్యం, జపాను పతనా-
నికి కారణ మవడమే కాక, సోవియట్టుయూనియనువంటి
పెద్ద రాజ్యముయొక్క విదేశరాజనీతిలో కూడా కొంత
మార్పు కల్పించింది. పెద్ద రాజ్యాలవారు ఒకరితో ఒకరు
ప్రపంచక యాజమాన్యం కోసం పోటీ పడుతూన్నారని,
సోవియట్టు యూనియను ఆ విషయంలో తక్కిన సామ్రాజ్య
కాంక్షాపరుల కే మాత్రము తీసిపోవడం లేదనీ వెనుక
వ్రాశాను. అందువల్లనే అమెరికా ఈ ప్రళయబాంబు రహ-
స్యాన్ని తమకు మిత్రమైన సోవియట్టు యూనియనుకు కూడా
చెప్పకుండా దాచిపెట్టుకొన్నది.

"ప్రళయబాంబు విషయంలో అమెరికా ప్రభుత్వం
అవలంబించే వైఖరిగానీ, ఆ ప్రభుత్వం నిర్ణయం కానీ, అమె-
రికా క్షేమానికి, ఆ దేశముయొక్క ఆంతరంగిక, విదేశ రాజ
నీతులకూ అనుగుణంగా ఉంటుం"దని అమెరికా అధ్యక్షు
ట్రూమన్ సెప్టెంబరు 23 వ తేదీనీ, అంతకు పూర్వమూ ప్రక-
టించాడు.

సోవియట్టుయూనియనుకు ఈ ప్రళయబాంబు రహస్యాన్ని
తెలియకపోవడమూ, ఆ రహస్యం తెలిసిన అమెరికా (తన
ప్రయోజనం కోసమే అనుకోండి) చైనాలోని చుంకింగు ప్రభు-
త్వానికి సహాయం చేస్తూండడమూ, చైనాయెడల సోవియట్టు

నానియను అవలంబించ తలచుకొన్న రాజనీతిలో మార్పును
ెలిగించినవి. అందువల్లనే చైనా జాతీయ స్వాతంత్ర్యంకోసం
మార్షల్ షియాంగ్-కే-షేక్ యే షరతులు ముఖ్యావసరము
ని ప్రకటించాడో, దాదాపు ఆ షరతులే, చైనా సోవియట్టు
యునానియనుల సంధి పత్రంలో కనిపిస్తూన్నవి. చైనా అంత
రంగిక వ్యవహారాలలో — ముఖ్యంగా సింకియాంగు విష
యములో తాను జోక్యం కలిగించుకోనని రష్యా అనడం
చాలా గొప్ప సంగతి. అది చైనా కేంద్ర ప్రభుత్వానికి వ్యతి
రేకంగా ఇప్పుడు గోల చేయవద్దని చైనా కమ్యూనిస్టులకు
సోవియట్టు నాయకులు చేసిన సూచన. ఆగస్టు 14 నాటికే
ఈ సంధిపత్రం పైన ఉభయరాజ్యాలవారూ సంతకాలు చేసు
కున్నట్లు మాస్కోలో ప్రకటించబడినది. కాని ఆసంధిపత
్రాలు ఆగస్టు 26 న చుంకింగులోనూ, మాస్కోలోనూ ఒకే
సారి వెల్లడించబడినవి. తక్షణం చైనా కమ్యూనిస్టుల వైఖరి
మారింది. అంతకు పూర్వం చైనా కమ్యూనిస్టు నాయకుడు
మావో ట్సూటుంగును (Mao Tsu-Tung) ను మార్షల్
షియాంగ్-కే-షేక్ రాయబారంకోసం రెండుసార్లు ఆహ్వా
నిం చాడు. కాని ఆయన ఆ ఆహ్వానాన్ని నిరాకరించాడు. ఈ
సంధిపత్రం ప్రచురించబడగానే కమ్యూనిస్టు నాయకుడు
మార్షల్ దగ్గరకు తన ప్రతినిధిని పంపడానికి అంగీకరించాడు.
అంగీకరించడమే కాదు — అంతకు పూర్వం "చైనాలో
అంతర్యుద్ధం తప్పదు. కాబట్టి గ్రీసులో బ్రిటను కల్పించు
కొన్నట్లుగా అమెరికాకూడా చైనాలో వెంటనే జోక్యం కలి
గించుకోవాలి" లని చెప్పిన కమ్యూనిస్టు నాయకులంతా ఇప్పుడు

చైనాకు శాంతిని చేకూర్చి, చైనా ఐక్యతకూ, భావిసౌభాగ్యానికి తోడ్పడడానికి తాము కంకణం కట్టుకొన్నట్లుగా మాట్లాడుతూన్నారు. సోవియట్టు విదేశ రాజనీతి కనుగుణంగా ఆయా దేశాలలోని కమ్యూనిస్టు లెంత తొందరగా తమ వైఖరిని మార్చుకొంటారో గమనిస్తూండండి పాఠకులు,

అయితే ఇప్పుడు చైనాకు, సోవియట్టుయూనియనుకూ జరిగిన సంధి, చిరకాలం కొనసాగుతుం దనడానికి వీలులేదు. జపానుతో తాను చేసుకొన్న ఒడంబడికకు "ఇక అర్థం లేదు. అది కొనసాగడానికి వీలులే'దని సమయం చూచుకొని ప్రకటించినట్లుగానే ఆటం బాంబునుకానీ, అంతకు మించిన మహామారణాస్త్రమునుగానీ సోవియట్టురష్యా కనిపెట్టకలిగిననాడు, చైనా సోవియట్టు యూనియనుల మధ్య నేడు జరిగిన సంధి గతి యేమవుతుందో చెప్పలేము.



---

84 వ పుటలో "కాంగ్రెసు వైఖరి" అను హెడ్డింగు చదువుకొనవలెను.